శ్రీ ర స్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.



# రుక్మిణీపరిణయ కావ్యము.

అ ను నీ గ్రం థ ము

శ్రీవేంకటగిరి సంస్థానాశ్రిత

మణిగొండ వేంకటరమణ కవిచే

సంస్కృతమునుండి యాంధ్రీకరింపఁబడినది.



చె న్న పు రి.

చదలువాడ సుందరరామశాస్త్రులవారి

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడినది.



1911.

శ్రీరస్తు.

రుక్మిణీపరిణయకావ్య

# విషయసూచిక.



రుక్మిణీపరిణయకావ్య విషయసూచిక

సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీప్రసన్న పాండురంగ విఠ్ఠలేశాయ నమః.



# రుక్మిణీపరిణయ కావ్యము.



శ్లో. శ్రీమత్కోదణ్డపాణివ్యాసపూర్ణప్రియాభిధశిష్యం మద్గురువర్యం
శ్రీమత్సర్వజ్ఞసచ్ఛాస్త్రోత్కరామ్భోజషట్పదముద్యత్సత్త్వగుణాఢ్యమ్
శ్రీమత్పణ్ఢరిపురీశారాధనాలోలచిత్తం మహాం వన్దే సుశుభార్థే
శ్రీమన్నాగేశమార్యం మూళగిర్యన్వయామ్బుధిచన్ద్రం సద్గుణసాన్ద్రమ్.

( మంగళాచరణము. )

శా. శ్రీరామాశుభదేక్షణోత్పలదళ◆శ్రీదాయి సత్యాశ్రయుం
డారాజచ్ఛుభలక్షణాంచితుఁడు రా◆ధాంచచ్చకోరీమహా
దారుం డౌ హరివక్త్రచంద్రుఁ డను వాం◆ఛల్ రాజగోపాలకృ
ష్ణా రాజోత్తమ యాచభూప నిరతా◆హ్లాదంబు నీ కిచ్చుతన్. ౧

ఉ. తాలిమి నాథువక్షమునఁ◆దా దయఁ బొల్పున నిల్చి భక్తదో
పాలి గణింప నీయక శు◆భావలిఁ గూర్చుచు నాథు నెప్పుడుం
బోల ననన్యయోగ్యగతిఁ బూజ◆లొనర్చెడు లక్ష్మి రాజగో
పాలకకృష్ణయాచనర◆పాల శుభం బిడు నీకు నిచ్చలున్. ౨

సీ. సషడంగవేదోక్తి◆చతురాస్యుఁ జతురాస్యుఁ
బాలితసర్వగీ◆ర్వాణి వాణిఁ
దతచరాచరజగ◆త్ప్రాణు జగత్ప్రాణుఁ
బావనగుణమణిఁ◆బవనురమణి

శేషిసత్తల్పవి♦శేషాత్ము శేషునిఁ
బరిహృతవృషగర్వుఁ ♦ బక్షివర్యు
సద్భక్తజనమన♦శ్శంకరు శంకరు
రుద్రునిభామఁ గా♦త్యాయనీమ
వరుస విఘ్నేభపంచాస్యు ♦ నరగజాస్యు
వ్యాసవాల్మీకిముఖ్యగీ♦ర్వాణకవుల
నమర నన్నయపోతనా♦ద్యాంధ్రకవులఁ
దలఁచి మ్రొక్కెద మత్కృతి ♦ తనరుకొఱకు. ౩

సీ. వివిధసాంగోపాంగ♦వేదస్వరూపతా
సుభ్రాజి తిక్కన♦సోమయాజి
కవితాప్రవీణతా♦కలనకావ్యవినుత
స్తుతిరాజి తిక్కన♦సోమయాజి
హరిహరనాథాఖ్య♦పరతత్త్వసేవనా
సుఖభాజి తిక్కన♦సోమయాజి
వేదాంతవిద్యావి♦వేకజితాబ్జజ
సుతరాజి తిక్కన♦సోమయాజి
వ్యాసవాల్మీకిరచితగీ♦ర్వాణభార
తోత్తరరఘూత్తమచరితాం♦ధ్రోక్తివిరచ
నామతివిరాజి తిక్కన♦సోమయాజి
మించి నామదిఁ గృప వసి♦యించుఁ గాత. ౪

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవిజనవందనంబునుం గావించి,

సీ. మహితవిద్యాప్రౌఢి♦మవిజితఫణిరాజు
వాదిరాజు జితాన్య♦వాదిరాజు

హయవదనప్రసా♦దాసాదితాఖిల
విద్యాసమార్జిత♦విమలకీర్తి
క్షమ రుక్మిణీశవి♦జయమహాకావ్యంబు
దేవభాష రచించెఁ ♦ దివిరి యందుఁ
బరికించి రుక్మిణీ♦పరిణయభాగంబుఁ
గొని తెనిఁగించెదఁ ♦ గోమసు మిగుల
రాజగోపాలకృష్ణుండు ♦ రమణఁ గథకు
నాయకుఁడు గాన నొనరింతు ♦ నాయకునిఁగ
రాజగోపాలకృష్ణుని ♦ రహిని గృతికి
సరసు లెల్లరు తగు నని ♦ సమ్మతింప. ౭

సీ. ఆత్రేయగోత్రప♦విత్రుఁ డాపస్తంబ
సూత్రుండు మధ్వార్య♦సుమతజనితుఁ
డల మణిగొండవం♦శాంబుధిచంద్రుఁ డౌ
కృష్ణార్యసూనుండుఁ ♦ గృష్ణభక్తుఁ
డెన్న మూళగిరినా♦నేశార్యశిష్యుఁ డౌ
నన నెగడినవాఁడ ♦ నట్టినేను
వేంకటరమణాఖ్య ♦ విదితుండను బ్రసన్న
పాండురంగకృపావి♦భాసితుండ
రహిని రాళ్ళపల్లి♦రాఘవార్యుఁడు బుధ
వరుఁడు ప్రీతిఁ దోడు♦పడఁగఁ గడఁకఁ
దెలిసినంతపట్టు ♦ పలికెద నీకృతిఁ
బ్రోవఁ గోరువాఁడ ♦ బుధులఁ గవుల. ౮

సీ. లక్ష్మీసరస్వతుల్ ♦ లక్షింప నిచటనే
కలిసి యుండుట చూపఁ ♦ గంటె మనుచు . .

భాస్వందురోచులు ♦ భావింప నిచటన
 కలిసి యుండుట చూడఁ ♦ గంటి మనుచు
దండధరేంద్రుల ♦ ధర్మంబు లిచటన
 కలిసి యుండుట చూడఁ ♦ గంటి మనుచు
విత్తేశబలివిధుల్ ♦ ఖత్తుగ నిచటన
 కలిసి యుండుట చూడఁ ♦ గంటి మనుచు
బుధులు పొగడ విద్యాధనం ♦ బులును వీర్య
కీర్తులును దండరక్షణ ♦ కర్తృతయును
గలిమి యీవియుఁ దమయందుఁ ♦ గలసి వెలయ
వఱలు చుందురు వెలుగోటి ♦ వంశ్యనృపులు. ౯

వ. అందు. ౧౦

సీ. ఏమాన్యప్రపపి ♦ తామహుండు హరిహ
 రాలయ నిర్మాత ♦ యై నుతిఁ గనె
నేమహామహుప్రపి ♦ తామహుండు రథాళిఁ
 దిరువీధుల రచించి ♦ తేజరిల్లె
నేమహీనాథుపి ♦ తామహుం డల స్వర్ణ
 నాముఁడై సార్థక ♦ నాముఁ డయ్యె
నేరాజవరుతండ్రి ♦ యెసఁగ సర్వజ్ఞాఖ్య
 సార్థకంబుగ భువి ♦ సరవిఁ బొల్చెఁ
బుత్త్రపౌత్త్రానుజాతస ♦ న్మిత్త్రబంధు
యుక్తి నెవ్వండు ధర నేలు ♦ చుండు నతఁడు
వఱలు వెలుగోటిరాజగో ♦ పాలకృష్ణుఁ
డల మహారాజబిరుదుఁడు ♦ యాచవిభుఁడు. ౧౧

ఉ. శ్రీలసితుండు వాక్ప్రియుఁడు ♦ చిత్తజవర్ధనమూర్తి మస్తమో
వ్యాలవిభుండు రాజు విబు♦ధావనుఁడుఙ్ సమవర్తియుఙ్ దసో
ఘాలయముఙ్ ధనేశ్వరుఁడు ♦ నౌనని తన్నృపు లెన్న రాజగో
పాలకకృష్ణయాచవర♦పాలకుఁ డేలు మహిఙ్ శుభోన్నతిఙ్. ౧౧

——(షష్ట్యంతములు.)——

క. ఏవంవిధగుణతతికిని, శ్రీవనజాక్షాంఘ్రిపద్మ♦సేవారతికిఙ్
సేవితగౌరీపతికిని, బావనసుకృతికి నితాంత♦వరశుభ్రకృతికిఙ్. ౧౨

క. హరిహయజనయుతహయునకు
హరిహయవరహస్తిసత్త్వ♦హస్తిచేయునకుఙ్
నరపాలననిపుణునకును
నరసారథిచరణశరణు♦నకు సుగుణునకుఙ్. ౧౩

క. గురుధైర్యమేరునిభునకు, వరవేంకటగిరిపురాధి♦పప్రభునకు శ్రీ
కరవెలుగోటిసువంశీ, య రాజగోపాలకృష్ణ♦యాచవిభునకుఙ్. ౧౪

——(కథాప్రారంభము.)——

వ. అంకితంబుగా నారచియింపఁ బూనినరుక్మిణీపరిణయకావ్యంబునకుఁ
గథాక్రమం బెట్టి దనిన. ౧౫

క. వరవేంకటగిరినాయక, వర పంచసహస్రసైన్య♦పతి వినుతగుణా
కర వెలుగోటిసువంశీ, య రాజగోపాలకృష్ణ♦యాచమహీశా. ౧౬

వ. అవధరింపుము. ౧౭

——(ద్వారవతీపురవర్ణనము.)——

క. సకలైహికవిభవాము
త్రికసౌఖ్యద్వారభూతుఁ ♦ గృష్ణుఁ బడయుటఙ్
బ్రకటితమై రాజిల్లెడు
నొకపురి ద్వారవతి నాఁగ ♦ నొప్పుగ జగతిఙ్. ౧౮

క. ద్వారవతి యనుచుఁ బిలుతురు
వారక స్ఫాటికకవాట ♦ నగపిహితలస
ద్ద్వారవతి సదావివృత
ద్వారవతిఁగ నుదిఁ దలంచి ♦ యారయువారల్. ౧౯

తే. గీ. అరయ వివృతంబ యయ్యును ♦ ద్వారచయము
వరమనోజ్ఞహరిన్మణి ♦ ద్వారబంధ
కాంతిచేఁ బిహితంబుగఁ ♦ గాన వచ్చు
దాన నెటు లెన్న నగు దాని ♦ ద్వారవతిఁగ. ౨౦

ఉ. రాజతనైజసౌధనిక ♦ రద్యుతి క్షీరధిఁ బోలుసీరధిన్
భ్రాజితశేషముఖ్యసరి ♦ వారవృతం బయి దుష్టదూరమై
తేజరిలుం గణింపఁ దెలి ♦ దీవి యనన్ నిజదీప్తి నెంతయున్
దా జగమందుఁ దత్పుర ము ♦ దారతమాధవసన్నిధానమై. ౨౧

మ. అరిసేనాను లనేకు లాపురి జగీ ♦ షాయత్తులై చేరుచో
వరజాంబూనదవప్రరత్నరుచులన్ ♦ భ్రాంతిన్ స్వరూపంబులన్
శరఖడ్గాదికపాణులం గని భయో ♦ చ్ఛ్వాసంబులం బాఱఁ జొ
త్తును వేగన్ బ్రతియోధులంచు దిశలన్ ♦ దోడ్తోఁ బరుల్ నవ్వఁగన్.

తే. గీ. లలి సుముక్తాళిరాజితా ♦ లయయు నిత్య
సత్యసత్ప్రియమోదాశన ♦ సత్సమూహ
శౌరిదయిత దుష్టాగమ్య ♦ ద్వారక యది
యన్నవైకుంఠ మనఁగ నొ ♦ ప్పారె జగతి. ౨౩

క. రత్నావృతవరగోపుర, రత్నావృతవప్రసౌధ ♦ రత్నగృహాసతీ
రత్నావృతతన్నగరీ, రత్నాప్తిఁ బయోధి యొప్పె ♦ రత్నాకరమై.

క. ముక్తాళు లలలసాగర
ముక్తములై చేరుచుండుఁ ♦ బురి గుహసేవన్

ముక్తాళులు భవసాగర
ముక్తము లౌచును వికుంఠ ♦ పురిఁ జేరుక్రియన్. ౨౫

క. ధర వణిజులు ముక్తాప్తికి, వరపోతము లాశ్రయించి ♦ వత్తురు పురికిం
బరసిద్ధులు ముక్త్యాప్తికి, హరిపదపోతంబుఁ జేర ♦ నరుదెంత్రటకున్.

తే. గీ. అల హరిపురంబు పరిధీకృ ♦ తాంబుధి యిత
రుల కగమ్యం బని విని ని ♦ రూఢచింత
చే జరాసంహితశరీర ♦ సీముఁ డగుచుఁ
దనదుపేరు మాగధుఁడు. సా ♦ ర్థకము సేసె. ౨౬

తే. గీ. ఘనతఁ గావ్యోచితశ్లోక ♦ కాంక్ష భావ
విదులు బుధులు వదాన్యులు ♦ పదపదములఁ
గడఁక విద్వజ్జనానంద ♦ కరవరార్థ
ముల విచారించు చుందురు ♦ మురరిపుపురి. ౨౭

ఉ. కూరిమి శంకరుండు జన ♦ కోటి కొసంగెడునేమహాత్ముని
త్తారకమంత్రరాజమునఁ ♦ దద్దయు నెవ్వనిపాదవారిచే
సారతరంబుగా నెగడ ♦ సాగెను గాశిక యట్టిశౌరి తా
నే రహిఁ నిల్చె ద్వారవతి ♦ నెన్నికఁ గాంచదె యద్వితీయమై.

మ. నగరీవారవధూరథస్థుఁడయి కం ♦ దర్పుండు భ్రూచాపమున్
దగ సారించి కటాక్షనీలనళినా ♦ స్త్రవ్రాతముల్ గ్రుచ్చి బల్
వగలం బాంథులఁ గట్టుచుండు స్మితరు ♦ క్పాశంబులన్ బ్రోద్ధతిన్
మొగి నెన్నంగ సమానులున్ వికలులై ♦ మోహావృతుల్ గా వడిన్.

తే. గీ. ద్వారక స్వగోపురాఘుక ♦ రాళి దివము
దాఁటు నందేమి చిత్రము ♦ తత్పురి తన
యంతరంగంబున ముకుందు ♦ నఖిలతీర్థ
రాజములఁ గల్గి తత్సేవ ♦ రాజిలుటను. ౩౧

సీ. వరయోగిజనులు ♦ ద్వారక హరిజప
బ్రహ్మాస్త్రధారులై ♦ రత్యధీశు
ధనువును బుష్పకృ♦తంబుగాఁ దద్వార
బాణాళిఁ బంచత్వ♦భాజనముగఁ
దత్సచివుని వసం♦తం వసంతం పశ్య
యనుచు నవ్వునటుగా ♦ నతనిమిత్తు
క్షయభాజనునిఁ గాఁగఁ ♦ గడిమిఁ దదనుగుల
మాధుర్యధుర్యవా♦ఙ్మహితములు గ
వరుసఁ దత్సేన నబలనై ♦ పరఁగునటులు
పౌనర వాని ననంగీకృ♦తునిఁగ నిటులు
నిశ్చలాత్మకులై స్మరు♦నిం బరాజి
తునిఁగఁ జేసి చరించు చుం♦దురు తపముల. 32

తే. గీ. ఎనయ మన్మథు నబలు జ♦యించి యతని
దయిత శ్రీకృష్ణసూనుఁ శ్రీ♦దయితపాద
వనరుహధ్యానమాత్రస్థ ♦ నొనరిచి పుత్రి
యతులు విహరింత్రు కామజ♦యైకలీల. 33

మ. స్మరునిం దర్పకుఁగాఁగఁ దద్ధితు జగ♦త్సమ్మోహకుంగాఁగఁ ద
ద్వరసేనం బ్రమదాళిఁగాఁగ సుమనో ♦ భావ్యంబుఁగాఁ జాపముఁ
శరరాజిఁ విషమంబుఁగాఁగ సుమన♦స్సంసేవ్యుఁ గా నూతు నెం
చి రమించుం బురిఁ గాముకాళి తగఁ ద♦త్సేనావశస్వాంతమై. 34

తే. గీ. అమలమాల్యానులేపహా♦రాంబరములు
సెలఁగ వారాంగనలు శుచి♦స్మిత లరుగఁగ
యామికులు నుదితేందు తే♦జోతిరిక్త
లగుట గుర్తింపఁగా నేర♦రైరి పురిని. 35

మ. వరశాస్త్రంబులు విన్చుఁ బాడుచు మదిన్ ♦ భావించుచుం భక్తిఁ ద
చ్చరణాబ్జంబులఁ గొల్చుచున్ సతతమ♦ర్చల్ సేయుచున్ దాస్యముం
గరిమం జూపుచు సఖ్యముం గొలుపుచున్ ♦ గామించి యాత్మార్పణం
బు రహిం జేయుచునుందు రల్లపురిఁ బెం♦పుం బొంది కృష్ణార్చకుల్.

మ. తగుతద్వప్రబహిర్గతాబ్ధి జలము♦గ్ధత్వాంబుల్ స్వాతిఁ బెం
పుగనున్ శుక్తిపుటంబులన్ జొరగలిన్ ♦ ముక్తామయంబై రహిన్
దగ హస్తాబ్జపుటాళిఁ గృష్ణజలము♦గ్ధత్వార్థ వార్యాప్తిఁ బెం
పుగనున్ విప్రకులాబ్ధి తత్తృణమునన్ ♦ ముక్తామయంబై బలే. ౩౮

తే. గీ. పురి సుధర్మపుం జావన♦మూలభూతుఁ
గృష్ణునిఁ గృతాధివాసుఁగా ♦ నెఱిఁగి యింద్రుఁ
డాత్మపురిగతి సభకు నా ♦ నను భయమున
స్వసభ నలసుధర్మాఖ్య నొ♦సంగెఁ హరికి. ౩౯

మ. స్వసుతుం గోర్కి కరానుషక్తవిలస♦చ్చక్రాంకశంఖాంచితుం
డు సురత్నావృతగాత్రవాస్యనిమిషుం♦డున్ ఫేనలేపాంగుఁడై
పస స్వాసక్త జలౌఘపాపహరుఁడౌ♦ప్పన్ యోగిజైహ్వాత్సవుం
డు సముద్రుండు పురంబుఁ బ్రోచు నలకృ♦ష్ణుం బోలుచున్ జేరువన్.

మ. పురి సచ్చక్రఁ గరాళిపుష్టకటకన్ ♦ భోగీంద్రభోగాస్పదన్
వరదృక్స్థానగతేందిరన్ గనకస♦ద్వప్రాతిపీతాంబరన్
గురుతన్ స్వోదరవాసిహంసగమనన్ ♦ గొల్లాలిసుధర్మావహన్
బరమాకార సముద్రమధ్యగ సురల్ ♦ పద్మాధరాలింగితన్. ౪౦

క. పురి యంగనాలమును ముఖ
సరసిజము దరస్మితమధు♦సరస మలకబం
భర మంగనాస్మరాస్త్రో
త్కరము కలిమి విశ్వమోహ♦కర మగు నెప్డున్. ౪౧

క. కలశాలికంఠసంచయ
విలసచ్ఛుభదకమనీయ♦వివిధోన్నతస
త్కలశాలికంఠసంచయ
విలసితగృహనికర మగుచు ♦ వెలయుఁ బురి రహిన్. ౪౨

ఆ. వె. పరమ మాశ్రమంబుఁ ♦ బురిఁ బొందర మ సర్వ
దానములను సర్వ♦దాజనములు
తృప్తి వొందు చెలమి ♦ దివిని బోలఁగ శ్రమ
మెఱుఁగ కుందు రచట ♦ నెల్లగతుల. ౪౩

తే. గీ. ధరణిఁ గాశిక శ్రుతిసంగ♦తస్వకోటి
మాత్రగుణముచేఁ బురికి న♦ప్రముఖ యగుచు
వడి నవద్యసంఛాదన♦వైఖరిజ్ఞ
కాన ధరియించె ధనురను♦కార మమర. ౪౪

చ. తతవరభిత్తిరత్నఫలి♦తప్రతిరూపవిచిత్రచిత్రమా
నితములు వాసుదేవగృహి♦ణీగృహముల్ నవరత్నరోచులన్
సతతము రంగసంచయసు♦సంగమునన్ రమణీయ మాప్రదే
శతతి ధరించెనో యనఁ బ్ర♦జానయనోత్సవకారులౌఁ బురిన్.

మ. ప్రియనృత్యం బొనరించు కేకితతిచేఁ ♦ బెం పొందుసౌధంబులం
బ్రియ మారన్ రుచిరాద్రిశృంగమతితో ♦ వేడ్రాలుచుం జెంత నా
రయఁగాఁ దమ్మును గ్రమ్మనీరధరగా♦త్రంబుం దగం జిమ్మెదున్
రయ మారం బురికేతువుల్ నిజపట♦ప్రాంతానిలప్రాహతిన్. ౪౬

చ. విమలమహాసువర్ణవర♦వేష్టనమున్ ద్యుతిదీపితాభ్రవి
ద్రుమమహారినీలముఖ్యగుణ♦ధుర్యవినూత్నవహోరురత్నశో
భి మహితసౌధశీర్షమును ♦ బింత మహిం గపిశీర్షమున్న నా
మమునను బిల్వఁగా బుధులు ♦ మానసవీథి సహింప రాపురిన్.

క. సరసలు విలసద్ధారసు
సరసారశిరోధర లగు♦సరసిజవదనల్
వరనయనైపుణ్యనయన
సరసిజజితపురుషవరలు ♦ చరియింత్రు పురిన్. ౪౮

తే. గీ. తగ నవనవోష్ఠదంతక్ష♦తములఁ జూచు
సవతికి దురంతచింతను ♦ యువతి కన్య
కద్ది దాఁచ నేరమిని దు♦రంతచింత
నిట్టు లాపురి ఫలసామ్య ♦ మిచ్చు చుండు. ౪౯

——( రుక్మిణీపత్త్రిసందేశ వర్ణనము. )——

క. అంబుజనయనుఁ డెలమి నన
యంబు జనంబులను బ్రోచు ♦ చాప్తులతో నా
యంబుజనిభపురి నిండుప్రి
యంబు జనింపంగ నుండు♦నంత విదర్భన్. ౫౦

క. అంచితగతి భీష్మకసుత
పంచాగ్రజయుక్తి యొసఁగి ♦ పత్త్రి యొకద్విజుం
బంచాస్త్రమాత రుక్మిణి
పంచెను హరికథకు నన్న♦వంచన విని తాన్ ౫౧

వ. ఇట్లు పంచి కృష్ణు నుద్దేశించి తనమనంబున. ౫౨

మ. అల భక్త్యంగనఁ గూడి దృగ్విషము నా♦భ్యావర్తముం బాఁసిప
ఙ్జలజంబుల్ శ్రవణప్రసాదంబు దరహా♦స స్నిగ్ధఫేనంబు స
ద్వలిసుభ్రూమహితోర్మి కేశచయశై♦వాలంబు పొల్చువి
త్తలపద్మాకరమందు చిత్తనృప క్రీ♦డల్ సేయు మశ్రాంతముల్. ౫3

మ. ఇను హస్తాబ్జమ విత్తలాంఘ్రిభిధునిన్ ♦ దృక్కైరవంబా తదా
స్యని శేషుల్ జలచిత్తచోర యలకా♦ఖ్యధ్వాంతముల్ జిహ్వ యన్

ఘనమండూకము తత్కథాజలధి వ♦క్షుం బక్కవాటంబ యూ
తనిహృద్గేహము నచ్ఛకోదితము శ్రో♦త్రంబా విడం బోకుఁడీ.

మ. విను భ్రాంతాత్మ వినింద్యజంతుశతముల్ ♦ విణ్మాత్రపాత్రంబులై
చనుమర్త్యాధమగాత్రమందు రతి నో♦జన్ వీడుమా విఠ్ఠలే
శుని నీలోత్పలవర్ణు నిత్యు స్వవశున్ ♦ శుద్ధాత్మునిం జేరు ప్రీ
తిని వే నిర్మలవిగ్రహున్ వ్రజవధూ♦తృష్ణాసముజ్జృంభకున్. ౧౬

శా. నాళీకాసనమారశంభువిలస♦న్నాకాలయప్రస్తుతున్
మాలాలంకరణప్రభాపహృతస♦న్మాన్యాంతరగ్రంథిసిన్
గాలీయాహిమదాపహారి మురలీ♦గానాఢ్య గోపాంగనా
లోలాత్మున్ విడువంగఁ బోకు మనసా♦లోకేశుఁ గృష్ణున్ హరిన్.

వ. ఇ ట్లయ్యంగనామణి యయ్యనంగపితం దలంచుచుఁ దదాయత్త
చిత్తయై యుండ నట మున్న గృహీతపత్త్రిం డగున మ్మేదినీసురుండు.

క. అవి గొని ద్విజుఁ డటకుం జని
యదిగో నిశాటారి యనుచు ♦ హరిసన్నిధి నె
మ్మది గొని యుండింపఁగఁ దా
నదిగొని చదువంగొనె శౌరి ♦ యధికప్రీతిన్. ౧౮

తే. గీ. పురుషుఁడు గరిష్ఠవిభవుఁడు ♦ పూర్ణుఁడు మతి
సామవేద్యుఁడు సామ్నాయ♦శాస్త్రధర్మ
పాలకుఁడు పాత్రదత్తాత్మ♦పదుఁడు నయిన
పాత్రునకు దత్త యాకన్య ♦ పరఁగ ధన్య. ౧౯

చ. కువలయనాథ కామవశ♦గుల్ పరు లాత్మల నన్ను నీపదాం
కవిరచితాంకనుం బడయఁ♦ గాచినవా రది సింహయోగ్యవ
స్తువు శునకాళి కోరుట క♦వో భవతాపహరస్వపాంగ యూ
హావమున నంతికాగతయు♦మానుచరాళులఁ జేయు వారలన్. ౨౦

తే. గీ. దయిత దేహ్యాంగజాతసి♦లయ దయాబ్ధి
యంగజాతశతోర్జితో♦దారరూప
యంఘ్రిసేవ నొసంగు మా♦హానమునందు
నన్నుఁ గైకొను వేగ య♦నాథనాథ. ౬౧

మ. అరిసంహార యుమేశహంసగమనేం♦ద్రాగ్న్యాదులన్ మౌనులన్
వరశాస్త్రార్థవ్రతాత్ములైనబుధులన్ ♦ భావింప కే ధిక్కరిం
చి రహిన్ నిన్ సకలాధినాథుఁ బ్రభుఁ గాం♦క్షింతున్ సదా నెమ్మదిన్
హరి సర్వోత్తము తావకీనఘననూ♦త్నాసక్తనై ప్రోవవే. ౬౨

తే. గీ. విమల స్వాపచ్ఛిదోర్జిత♦విక్రమౌఘ
లోకనాథ దయాంబుధి ♦ లోకవంద్య
గోపికారక్ష యచ్యుత ♦ కూర్మి నన్ను
స్వీయ దుర్దశ దొలఁగించి ♦ వేగ ప్రోవు. ౬౩

తే. గీ. అన్న యారుక్మితో నేమి ♦ యయ్య యైన
భీష్మకునితోడ నా కేమి ♦ పృథ్వి రాజ
సంఘతులతోడి దేమి నీ♦జాయ నైతి
మున్నె కావున నను స్వీయ ♦ నెన్నికొనుము. ౬౪

తే. గీ. ఘన త్వదంఘ్రియుగ్మార్చన♦కర్మయోగ్య
నెసఁగ నన్యజనాభోగ్య ♦ నీశ నన్నుఁ
గైకొనుము తక్క తేని యీ♦కాయ మింత
వదలి త్వన్ననోయోగ్యరూ♦పంబుఁ గొందు. ౬౫

చ. అరయఁగ నెల్ల జీవులకు ♦ నచ్యుతతాప్తి ప్రసిద్ధ మయ్యు నే
వరుని నిరూఢిఁ బొందెను ధ్రు♦వంబుగ నచ్యుతనాను మట్టి ని
న్నె రహి మనంబునం బతిగ ♦ నేను వరించితి వీరవర్య శ్రీ
కర చను దెంచి వేగ ననుఁ ♦ గైకొనుమా కొనుమా యశం బిటన్.

ఉపేంద్రవజ్ర. త్వదైక్యబుద్ధుల్ శిశు♦పాలముఖ్యుల్
త్వదేకపత్నిన్ననుఁ ♦ దారు పొందన్
యదూద్వహా కోరెద ♦ రౌను పొందన్
త్వదైక్యబుద్ధుల్ కన ♦ దైత్యు లౌటన్. ౬౭

తే. గీ. మొగి ముకుంద సౌందర్యస♦ముద్ర యిమ్ము
ఈక్షణంబా శ్రిత సగునా ♦ కీయ వేని
ప్రాణనాథ క్షణాశ్రితా♦భాగ్య మైన
నిమ్ము దిక్చర నైన నా ♦ కిందిరేశ. ౬౮

తే. గీ. ఈవు దేవ స్వతంత్రుఁడ ♦ వేను గమల
నీదు జాయను గావున ♦ నాదుప్రార్థ
నానుసారంబుగ నసజ్జ♦నాభిమాన
హాని యొనరింపు వైళంబ ♦ ప్రాణనాథ. ౬౯

క. శేషించిన సమయమున న
శేషజగం బుదరమందుఁ ♦ జేర్చి మహాబ్ధిన్
శేషునిపైఁ బండెడుశ్రీ
భూషణ నిను వీడి కోరఁ ♦ బోలునె యన్యున్. ౭౦

చ. హరి సదశావృతంబు లగు♦నబ్జభవాండము లెన్ని యేని యే
పరమునిరోమకూపముల ♦ భాసిలెడుం బరమాణులీల నో
వరదుఁడ యట్టినీతనువు ♦ వర్తిలు నారయఁ బాంచభౌతిక
స్ఫురితముగా నటంచనుట ♦ చొప్పడునే తగునే వినంగనున్. ౭౧

## ( కుండినపురప్రవేశ వర్ణనము. )

క. అనునాపత్త్రాలాపము
మనమున హర్షమును బ్రీతి ♦ మల్లడిగొనఁగాఁ

గని యరద మెక్కి యప్పుడె
చనియె వడిఁ మాధవుఁడు ని◆జప్రియకడకున్. ౨౨

క. కమలాసందేశంబునఁ
గమలాక్షుం డలరి యరిగెఁ ◆ గడువడిఁ జతురం
గములఁ గొని దరస్మితముఖ
కమలుండై వేడ్క భీష్మ◆కప్రభుపురికిన్. ౨౩

తే. గీ. వచనమాత్రహృతుం డయి ◆ వాసుదేవుఁ
డల్ల బ్రాహ్మణుఁ జేపట్టి ◆ నధికకరుణ
నట్టియాశ్రితపక్షగుఁ ◆ డమర రుక్మి
ణీకరగ్రహణము సేయు◆టే కడిఁదియె. ౨౪

తే. గీ. అమలకమలోదయార్థ ము◆ద్యన్మరీచి
నుచయభాసితసర్వదే◆శుండు రచిత
నిశిచరోలూకశోకుండు ◆ నెటి దినేశు
గతిని సచ్చక్రమానిత◆గతియు నగుచుఁ
బూర్వసింధూపకంఠముఁ ◆ బొంది వెలిఁగె. ౨౫

చ. హరి యట దృష్టపూర్వ మగు◆నానగరిం జొర నొల్ల కొక్కెడం
బురమువెలిన్ వసించెఁ బర◆ముం గన వేడ్కలు తొంగలింపఁగాఁ
బరువిడి వచ్చునాగరక◆పంక్తుల నాస్థలి యాపురిం దగన్
బరువడి గెల్చె నాఁ దనరె◆ వైఖరిఁ దీరి దృగుత్సవోన్నతిన్. ౨౬

తే. గీ. పౌరు లప్పు డుపాయన◆పాణు లగుచు
భద్రమూర్తి సౌందర్యస◆ముద్రసాంద్రుఁ
జూచి యన్యులు వ్యర్థు లం◆చు మది రోసి
విభు హరి సదారు లౌచు సే◆వించి రెలమి. ౨౭

చ. ఇతఁ డతనుండు కాఁడు గణి♦యింపఁగ శ్యామలకోమలాంగకుం
డితఁడు విధుండు కాఁడు మది♦నెన్నఁగ పీతకళంకశంకుఁ డీ
యతిసుభగుండు కాఁడు రవి♦యాశ్రితలోకదృగార్తిహారి తా
నితఁడు పురాణుఁడుం బురుషుఁ♦డీప్సితదాయియు నద్వితీయుఁడున్.

తే. గీ. కమలవామె యగు నాపద్మ♦గంధి భీష్మ
తనయ సుభగాగ్రగణ్యుఁ డీ♦తఁడు తదీశుఁ
డిట్టివీరలకెలయిక ♦ తెలమిఁ గోరు
చున్నమాకోర్కెఁ దీర్చుత ♦ మొగి విధాత. ౨౮

మ. అనువొందం బురుషాగ్రగణ్యుఁ డితఁ డే♦నాఁటం బ్రియుండౌ రుక్మిణిన్
మనభాగ్యంబునఁ బొందెనేని యది హే♦మం బింద్రనీలంబుఁ గూ
ర్చినయట్లొప్పు నన్యాపాలయిన ల♦క్షింపంగ జాంబూనదం
బున లోహం బతుకంగఁ బెట్టినటులౌఁ ♦ బో యెల్లు కానున్నదో.

తే. గీ. ఇటులు పౌరులు పల్కుచుఁ ♦ గృష్ణు వినుతి
సేసి నయనోత్సవంబులు ♦ సేసి కొనఁగ
హరియు దయతోడిమందస్మి♦తాస్య మమర
వారి రంజిల్లఁగాఁ జేసె ♦ నరయుఁ డంత. ౩౧

(రుక్మిణీహరణ వర్ణనము.)

తే, గీ. సంచలత్పతాకోజ్జ్వల♦చామరౌఘ
మై పరిస్ఫురచ్ఛత్రస♦హస్రశోభ
మై విచిత్రతూర్యధ్వను ♦ లాశ లంద
నపుడు రుక్మిణికులదైవ♦యాత్ర యొప్పె. ౩౨

క. స్వజనకగృహదేవిఁ గొలిచి
నిజగృహదేవుఁ గన నరిగె ♦ నెఱిఁ దచ్ఛగణాం

బుజసన్నిధి రథ మెక్కక
నిజహృదయము వొంగ రుక్మిణియు నెన్నడతోఁ. ౭౩

మాలిని. జలజకులజగంధస్పర్ధిసౌరభ్య యంతన్
స్వలనవిలసదక్షి స్తంభితాన్యాక్షి యాచున్
గలికి విమలపూర్ణాగణ్యలావణ్య త్రోవన్
గలభగతి నిజేశున్ గామదున్ భైష్మి చూచెన్. ౭౪

క. తనతలిదండ్రులకూడిక
కు నడ్డ మాట యుచితంబె కున్నృపుల కనుచున్
ఘనరోషంబున నెల్లర
ఘనమూర్ఛల ముంచె స్మరుఁడు కనదస్త్రములన్. ౭౫

శా. దేవ్రాత్తంసుఁడు భూతముల్ మదనమందీభూతచిత్తంబు లౌ
నావేళన్ జనియెన్ స్వతంత్రుఁ డల పుల్లాక్ష్యంబుజోద్భూతహ
ర్షావార్యోదకధార మోదవిపులోద్యద్రోమరాజిన్ బలే
యావైదర్భిని బాణిచేఁ దనరథంబందున్ వడిం గొంచుఁ దాన్.

చ. పరిణయ మేటికిన్ మరలఁ బద్మ కనంగ నపాంగదూతికా
చిరవినివేదితాత్మ ఘనచిత్త సురాగ సుయోగ రుక్మిణిన్
బరముఁడు కృష్ణుఁ డార్తజనబంధుఁడు శ్రీరమణుండు ప్రీతుఁడై
పరువడిఁ గొంచు వే యరిగె వైరివిదారుఁడు నిండువేడుకన్. ౭౭

మ. పతివక్త్రేందుసమీపలగ్నముదితప్రాంచత్కపోలాఢ్య త
న్నతహస్తాంబుజయుగ్మ వేష్టితలసన్మధ్యాఢ్యయున్ లోకస
న్నుత భర్త్రంసయుగాహితాంసయుగ సంతోషాబ్ధిమగ్నాత్మయై
సతి పాణిగ్రహణాధికోత్సవము గా స్వాంతంబునం బొంగెఁ దాన్.

( యుద్ధ వర్ణనము. )

చ. మదనవశుల్ మహీశులు స♦మానులు వేగ తదీయవిప్రయో
గదహనదహ్యమానులయి ♦ గాత్రము లానలినాక్షి ముందటన్
వదలఁగ నిశ్చయించి తగ ♦ భానుని వెంటఁ దమంబు వ్రావున
ట్లదలిచి శౌరి వెంబడి ర♦యంబున నేగిరి లుబ్ధబుద్ధులై. ౮౯

సీ. రమణ భైష్మిని బరి♦రంభణం బొనరింపఁ
బూనినకుజనుల♦భుజయుగముల
సాంద్రమాముఖ♦చంద్రచుంబనవాంఛ
నరుగుదుష్టులయుత్త♦మాంగములను
లలి ననింద్యచరిత్రఁ ♦ గలసి భాషింపంగ
లోలు లౌధూర్తుల♦నాలుకలను
లోకమాతను గూడి ♦ లోలత శయనింపఁ
గోరినఖలులశ♦రీరములను
శౌరిభటులు నిశిత♦శస్త్రాస్త్రచయముల
నఱికి తఱిగి త్రెంచి ♦ నరకలోక
వాసి యైనప్రేత♦వర్గంబుతోఁ శయ్యఁ
బండఁ జేసి రథిక♦బలులు వేగ. ౯౦

శా. సుగ్రీవప్రోద్ధత సైన్యమాత్రబలుఁ డా♦చున్ రక్తపాథోధి న
త్యుగ్రాస్త్రాళిహతేభవాజితతిఁ దో♦డ్తోఁ గట్టి ప్రాచీనపం
క్తిగ్రీవున్ జితుఁ జేసి పొందె భుజశ♦క్తిం బూర్వరాముండు న
వ్యగ్రాస్యున్ వడిఁ బూర్వసీతను స్వకీ♦యున్ బూతవృత్తిం దగన్.

చ. అనుపమశౌరియుద్ధగతి ♦ నాకసమం దమరాళి పొల్చి క
న్గొనుచును శత్రురాజిఁ గని ♦ కొందఱు పల్కిరి కశ్చి దచ్యుతం

వ్యసనమద హేలా యటంచు నప ♦ రోటఁ దిభయాదివనాక్రమిత్రా త్తటం
చెనయఁగ నొప్పు కశ్చిదహ ♦ యీదహయీయనికొందఱుఁ దగన్.

మ. శివ నాథాహితమాత కై ట్లుపకృతిం ♦ జేసెన్ దగం దీర్చె నే
నవలాకున్ హరివిప్రయోగ మరయం ♦ దద్విప్రయోగంబు నా
యువిదన్ శ్రీదయితుండు తా స్వవిరహ ♦ యోగ్యన్ సమవ్యాపినిన్
భువి నశ్లేషకథన్ గొనెన్ శ్రుతిచయం ♦ బుం జక్క రక్షించుచున్
వివిధాశ్లేషకథాళిఁ గోడ ఖలులన్ ♦ వేవేగ శిక్షించుచున్. ౯౩

మ. హరి యాశత్రుసమూహ ముస్సుఖశిఖుం ♦ డై స్వప్రతాపాగ్ని వే
ల్చి రహిన్ రక్తరసార్ద్రితం గన శర ♦ శ్రేణీవృతిం జేసి వా
విరి స్వస్థాప్పితపుష్పలాజవృతుఁడై ♦ పృథ్వీశదత్తార్థముల్
సరగం గొంచు స్వకీయఁ గొం చరిగె ని ♦ శ్శంకన్ నిసర్గప్రియున్.

వ. హరి తనజాయఁ గొం చరుగ ♦ నప్పుడు తద్ఘనబంధుదుర్దశం
బరువడి నొందిన ట్లన నృ ♦ పాలురు కొందఱు కాలుప్రోలు వొం
దిరి మఱి కొంద ఱేఁచిరి త ♦ గన్ విధి దూఱుచు మూర్ఛ గొంద ఱొం
దిరి శిశుపాలముఖ్యులు మ ♦ దిం దురపిల్లిరి మోహితాత్ములై. ౯౫

క. అరయఁగ రిపుసైన్యము శ్రీ
హరిచేఁ దత్సేనచేత ♦ హతమయ్యె నటం
టరయమి జననీద్రోహుని
నిరఁ జైద్యునిఁ గూడుటయె దహించె నసలమై. ౯౬

క. రుక్మిణి కనఁ జక్రధరుఁడు
రుక్మిగతి విరోధియై ని ♦ రోధించినయా
రుక్మిధనుశ్శతము విఱిచె
రుక్మమయము భావికార్య ♦ రుచిఁ గనఁ బూనన్. ౯౭

తే. గీ. రుక్మిణీరూప యగుసిరి ♦ రుక్మిగృహము
విడిచి చన నంతలో నింద్ర♦వినుతకీర్తి
మురరిపుఁడు వాని ముండిత♦మూర్ధజునిఁగఁ
జేసె యుక్తంబ కద గత♦శ్రీకున కిల. ౯౭

తే. గీ. అంతఁ దరళనేత్రాంత య♦నన్యకాంత
బహుసహస్రసంఖ్యావని♦పాలభంగ
సమ్యగుత్థభాస్వజ్జయ♦చంద్రముఖులు
నాత్మదాసీజనులు గాఁగ ♦ నలరె భైష్మి. ౯౮

మ. తనయోధుల్ జయకామినీపరివృతుల్ ♦ ధైర్యోర్జితుల్ గర్జిలం
గన నశ్వాళి రణాప్తవాజినుల వే♦డ్కం బొంది హేషాధ్వనిం
దనరన్ హస్తులు హస్తినుల్ కలసి యం♦తన్ మోదిలన్ బృంహిత
ధ్వని భర్తేష్టుఁడు మున్న చేసె దయితా♦ప్రాప్తంబుగాఁ దత్తతిన్.

( ద్వారకాగమన వర్ణనము. )

క. జలజాతాయతలోచనుఁ
డలంకృతం బగునిజపురి ♦ హయహస్తిరథా
వలితో నామేచకకుం
తల యాప్రియతోడఁ జొచ్చెఁ ♦ దద్దయు వేడ్కన్.

( మూలమాధవోపవనప్రవేశ వర్ణనము. )

సీ. వృక్షరాజంబులు ♦ వివిధపుష్పంబుల
శుకసమితి మనోజ్ఞ♦సూక్తితతుల
మలయుకోకిలరాజి ♦ మంజుస్వరంబుల
నార్తకేకిగణంబు ♦ నృత్తములను
గంధగజావళి ♦ గమనైకచతురత
శైలముల్ చారుసి♦ద్ధరపరముల

మణికుట్టిమస్థల♦గణము సుచ్ఛాయల
హరిణముల్ తరళేక్ష♦ణాధికతను
బరఁగు చుండ రాజ♦భవనంబుబాగున
నొప్పు చున్న శుభద ♦ ముపవనంబు
మాధవుండు వేర♦మాదేవితోఁ గూడ
వచ్చి మూలమాధ♦వంబుఁ జేరె. ౧౦౨

ఆ. వె. వసుధ విశదరీతి ♦ వైదర్భిఁ బెండిలి
లోన కరము వట్టి ♦ లోఁ దలంచి
మూలమాధవుండు ♦ మూలమాధవమునఁ
దోడిబంధుజనుల♦తోడ విడిసె. ౧౦౩

వ. అంత. ౧౦౪

(సూర్యాస్తమయ వర్ణనము.)

తరువోజ. సురలు మాహేంద్రది♦క్సుదతికి వేడ్క
శుభకుండలము రచిం♦చుట కాత్మ నెంచి
యరయ వాతాయనం♦బై గగనాఖ్య
మహాభాజనంబున ♦ నగ్నిలోఁ జేర్చి
పరితప్త మైన సు♦పాయంబుతోడ
వడి స్ఫులింగాలితో ♦ వారిలో నైనఁ
బరఁగుహేమం బన ♦ వఱలి సూర్యుండు
పడెను రాగాంకుఁడై ♦ పశ్చిమాంబుధిని. ౧౦౫

మ. కరపాళి న్నగపాళిఁ బట్టుకొనియున్ ♦ గంజాప్తుఁ డబ్ధిం బడెన్
గరముం జిత్రమ కా సరిత్తతిని పీఁ♦కన్ శోషిలం జేయు నం
చురుకోపంబున నబ్ధి మ్రింగె నని నే ♦ నూహింతుఁ బో మ్రింగరే
పరు లాత్మీయజనాపకారుల సమీ♦పం బొందు వేళన్ వడిన్. ౧౦౬

చ. రవి సహజాత మయ్యును స్వ♦రాగము ద్రోచి సదబ్జచక్రమా
స్యవరకరాళి విష్ణుపద ♦ మంది కృతోగ్రతపుండునై తగన్
దివిఁ బ్రతతోర్ధ్వపాదుఁ డయి ♦ దేవవరుం డటఁ జేరెఁ దత్ఫలం
బవు నటు గాక వార్ధిఁ బడె ♦ నం చనుటల్ తగ వౌ నొకో ధరన్.

తే. గీ. తాపసులఁ దప్తులను జేసి ♦ ధరణి జీవ
నంబుఁ గర్షముల హరియించి ♦ నలినిసత్సు
కాంతి మాయించురవిపాత ♦ మెంతు మేము
యుక్తమ యటంచు యుక్తిస♦హోక్తు లరసి. ౧౦౮

చ. ద్యుమణియు వజ్రపాణిదిశ ♦ నొందెను జన్మము మింటిమధ్యమం
దమరఁ బ్రవృద్ధగాత్రుఁడుగ ♦ నయ్యెను వాశిదిగంతమందు న
స్తమయము నెందె బాపురె వి♦ధాతృనిదేశ మ దెంతవారి కే
ని మఱి యలంఘనీయ మగు ♦ నెమ్మది నెంచఁగఁ జూవె మేదినిన్.

ఉ. రాగి యినుండు దిగ్యువతి♦రాజిపయోధరసీమలం గడున్
రాగము నుంచి మేరుగిరి♦రాజము దాఁట దిగంగనాళి సాం
ధ్యాగతపక్షిరావముల♦వ్యాజమునన్ విలపించె నాఁ దమో
యోగము వే యనంతరమ♦యొందినమూర్ఛ యనంగఁ బొల్చె నౌ.

చ. వననిధిహృత్పదంబు తలఁ♦పన్ మఱి సంధవళీకృతాంబు వౌ
తనప్రతిరూప మేర్పడఁగఁ ♦ దా నటఁ జూచుచుఁ శాంతుఁ డెల్లెడన్
జనహృదయంగముం డగుచు ♦ శ్లాఘ్యతముం డగుఁ గాదె యంచుఁ [దా
నును గడు శాంతిఁ బూని తప♦నుండు పయోనిధిఁ జొచ్చె నంతటన్.

శా. తో నబ్జాళినితాంతమిత్త్రుఁ డలమి♦త్రుం డస్తముం బొందఁ బ
ద్మానీకం బమలాంబులొందియుఁ దదా♦స్యవ్రాతముల్ కాంతులన్

హీనంబై మొగిడెన్ వినష్టుఁడు ప్రియుం ♦ డెన్నంగ సంపన్నతా
నూనాస్యంబున లేని ముద్రయుఁ గాం♦డో చిత్రరీతిన్ భువిన్.

సీ. కంజ మాకంతోద♦కంబుల వసియించి
హృద్గతమధుకర♦బృందలలిత
ఝుంకారమద్ది ర♦మోంకారమై యొప్పఁ
గలితకంటకకంట♦కములు వెలయఁ
మంత్రార్థచింతమై ♦ మాటికిఁ దల యూఁచు
కరణి నీషత్కంపి♦శిరముతోడ
హంసౌఘశిక్షితం ♦ బై తాపసునిఁ బోలి
మదిలో విధాత్రునిఁ ♦ బదిలపఱచి
కూర్మి మిత్రోదయంబును ♦ గోరి కడఁక
నానిశంబును దాఁ దప♦ మాచరించు
చున్నదియ పోలెఁ గనుపట్టె ♦ వన్నె దక్క
ధాత్రి నిటు లుండ వగు మైత్రి ♦ మిత్త్రినెడల. ౧౧౩

## (చంద్రోదయ వర్ణనము.)

తే.గీ. రవి యపరదిగ్యువతిఁ జేరి ♦ రాగ మొందఁ
బ్రాగ్దిగంగన ఘనరోష♦రక్తమును ని
బద్ధనీలభ్రుకుటియునై ♦ వక్త్ర మొనర
నిలిచె నాఁగ నవేందుమం♦డలము వ్రాలిచె. ౧౧౪

తరువోజ. అల శశి మున్ ప్రాగ్ది♦గంగనఁ గూర్చి
యటకు సంధికిఁ దార♦కాళులఁ బనిచి
యలరు చామీఁదఁ దఁ♦దధ్యక్షులు కొంగి
యఖ్యదిక్సంగజ♦న్యస్ఫురల్లోప.

తులితతమంబును ♦ దోన మాయించి
తుంగకరంబుల ♦ తో దాని దాఁకి
సులలితాస్యాంభోజ ♦ చుంబనార్థముగ
జోక మీఱఁదికిఁ బ్రాకఁ ♦ జొచ్చెను నిజము. ౧౧౫

మ. అల దిగ్భామలు చంద్రకోమలకరా ♦ ఘూత్తాంగసంగంబుచే
నెలవుం బొంది తమంబునున్ విడిచి తా ♦ రెందుం బ్రియుం గాఁ జనం
బులు నిద్రించుతఱిన్ వరించిరి తమిన్ ♦ బాల్పొంద నిమ్మేదినీ
స్థలి నెప్డున్ గణియింత్రె నూత్నవిషయా ♦ శల్ పాపసంసుంబులన్.

తరువోజ. సరసుఁ డావిధుఁడు ప్రా ♦ గ్జలధిస్నానంబు
సలిపి ఫేనం బను ♦ చందనం బలఁది
కరము స్వాంకం బలం ♦ కారమూల మగు
ఘనసీలతిలకంబు ♦ గాఁగఁ దారౌఘ
వరహారమొంది న ♦ భం బనుకబరిఁ
బట్టి కౌఁగిటఁ గర ♦ పంక్తితోఁ జేర్చి
చిరరాగమునను రం ♦ జిల్లఁగాఁ జేసి
చెలిఁ బ్రాగ్దిగంగనఁ ♦ జేరి ముద్దిడియె. ౧౧౬

చ. అల యుదితోర్ధ్వరశ్మిని శ ♦ శాంకునిఁ గూడి సతారమై తగన్
వెలుఁగునభంబు స్వర్ణపరి ♦ వీతసురాధిపనీలమధ్య మా
విలసితకంఠభూషను ఘ ♦ విం దగుహారముఁ బొంది మించునా
జలరుహనాభువక్షము వ ♦ సన్ గణనీయతఁ గాంచె నెంతయున్.

తరువోజ. సలిలవాహావృత ♦ సర్వభాగంబు
శశలక్షణంబు నీ ♦ షద్దృష్టకోణ
మొలయ నభోగ్రస్థ ♦ ముదితేందుబింబ
మొగి హారితోపదం ♦ బొప్పెఁ గాశ్మీర

లలితంబు మఱియుఁ జే◆లమున నావృతము
లలి ముకురద్వ్యక్రాంచ◆లంబును మఱియుఁ
దలఁప మధ్యోపరి◆స్థము భైష్మి దైన
స్తనకోశమును బోలి ◆ తద్దయు వింత. ౧౧౯

తే. గీ. దిగ్యువతిపతి రవి యన్య◆దేశమునకు
నరుగఁ జంద్రుఁడు మెల్లన ◆ నరుగుదెంచి
కరముల గ్రహించె వారియం◆బరము కడిమి
దాన నేమొ కళంకి నాఁ ◆ దలఁపఁబడెను. ౧౨౦

చ. ఇరవుగఁ బౌర్ణమాసినిసి ◆ నిందుఁడు కృష్ణయశఃపురంధ్రి దా
హరిణమదాక్తముం బ్రవిర◆లాంచితకేశభరస్థపుష్పముల్
వరశుభనిత్యసంస్తుతుల◆వ్యాజమునన్ స్వముఖంబులం దగన్
సురవరు లుంచునద్ది యగు◆సుందరవక్త్రిమ యద్యోఁ గానిచో
సిరికిఁ బ్రమోదముల్ రిపుల◆చేడెల కార్తియు నెట్లు చేసెడున్.

గీ. రవి దివస్పతి హృతతస్క◆రప్రచారుఁ
డమర నరదృగ్విదూరవ◆ర్త్మమును బొంద
రజనిపతి పూర్ణబింబుఁడు ◆ రహిని వచ్చి
మానవులకు శ్రమం బంత◆ మాయఁ జేసె. ౧౨౧

వ. అంత. ౧౨౨

(సూర్యోదయ వర్ణనము.)

చ. హరి పురిఁ జేర నంచ విహ◆గాళిరుతంబులు తెల్పఁ బ్రొద్దిగ
బ్ధి రమణ స్నాతుఁడై యచల◆పీఠి వసించి సరోరుహంబులం
గరములఁ బట్టి రాగి యయి ◆ గాఢతమం బఱ శౌరిపూజకై
కరములఁ జాఁపె నాఁ దరణి ◆ కానఁగ నయ్యెను బూర్వదిక్తటిన్.

తే. గీ. మేరుశైలస్థ సురతతి ♦ శౌరిపూజ
కొనరఁగ సముద్రదీర్ఘిక ♦ నుండి కొనిన
రమ్య మైనసహస్రప♦త్త్రి మన నభము
పొందెను సహస్రకిరణుండు ♦ పొలుపు మీఱి. ౧౨౫

చ. దివిని ద్యురత్న మొంది తగఁ ♦ దేజరిలన్ భువనోదయంబుతై
భువి నల యంబుజాతములు ♦ పొల్పెసఁగన్ ముదితంబు లౌచు నీ
భువి యదువంశరత్న మది ♦ పొల్పెసఁగన్ గడు హర్షసంగతిన్
దివి నమరాననాబ్జములు ♦ తేజరిలెం దగఁ జిత్రరీతిగాన్. ౧౨౬

తే. గీ. ఉష్ణరశ్మ్యుదయంబున ♦ నొనరఁ దరులఁ
బక్షిగణములరవములు ♦ వఱలె మఱియు
సతులదుష్టోష్ణరశ్మి యా♦హరి పొదలఁగ
వందిమాగధరవములు ♦ వఱలెఁ బురిని. ౧౨౭

తే. గీ. ఊర్ధ్వముఖకేతనాభంబు ♦ లొగి నధోము
ఖాత్తతోరణాకారంబు ♦ లై మయూఖ
ములు దివి వెలింగెఁ బురి నూర్ధ్వ♦ముఖపతాక
లల యధోముఖతోరణ♦ములు వెలింగె. ౧౨౮

తే. గీ. ఉన్ముఖమయూఖతతిచేత ♦ నొనర విష్ణు
పదము నంటుచుఁ గ్రమమునఁ ♦ బడసె నూర్ధ్వ
మమరఁ దరణి విష్ణుపదము ♦ నంటుపుణ్యుఁ
డొనరఁ గ్రమముగ నూర్ధ్వంబు ♦ నొందు టరుదె. ౧౨౯

తే. గీ. తిగ్మరోచియు ఛాయ నొం♦దినజనులకు
గ్లాన మీయక సుఖదాయి ♦ గాఁగ నొప్పెఁ
గ్రూరుఁ డయ్యును దగఁ దాప♦కారి యౌనె
పరఁగ స్వకళత్రసంబంధ♦భజకులకును. ౧౩౦

వ. అంత నవ్వసుదేవనందనుండు వందిమాగధస్తుతుల మేల్కాంచి కాల్యకరణీయక్రియలు నిర్వర్తించి రుక్మిణీసహితుండై పురప్రవేశంబు సేయునప్పుడు.

( ద్వారకాపురప్రవేశ వర్ణనము. )

చ. తనవిభుఁ డొక్కఁడెం గాని సధైర్యుఁడు రాఁ గని యల్గి ద్వారకం
దొనరఁగ ద్వారకాయువతి యుల్లసితోభయభాగదివ్యకాం
చనకిరణాంచలంబున నిజప్రియు లోనికిఁ బోవకుండ ని
ల్చినయది యయ్యె దానిహరి ప్రేమకటాక్షములం గనుంగొనెన్.

చ. హరి బలవంతుఁడై చొరఁగ నప్పుడు తత్స్మితచంద్రికార్ద్రన
ద్వరశశికాంతమై నయనవారి ధరించినయట్లు లొప్పి పై
న్వరచితసంభ్రమోత్థఘనసవ్యరజోమలినాస్య యాచు భా
సురపురలక్ష్మి యుగ్గలవచోరభసంబున నొప్పె నంతయున్.

మ. నగరీకాంత వియోగశంకిమతి స్వాంతప్రస్ఫురద్వప్రల
గ్నగరిష్ఠోన్మణిరాజిఁ దత్ప్రతికృతిన్ దా నిల్పి యౌత్సుక్య మొ
ప్పఁగఁ దద్భూషణకాంతులన్ ఫలితమై భావింప నాయచ్యుతున్
దగ శ్రీకృష్ణు నిజేశుఁ గొల్చు చరిగెన్ దన్వంగియై తద్దయున్.

తే. గీ. నెఱిఁ జలత్పతాకానిలనిర్మలీకృ
తము రథౌఘచక్రావళిఁ దగ సమీకృ
తము సురాలిముక్తామలసుమలసితము
తతగజేంద్రదానాంబుసించితము మఱియు. ౧౩౫

ఉ. పండితసాదు లెల్ల హయపాండితిమై నడిపింప నిట్టటుల్
మండలధావనోద్యతత మానితచామరమండనాళులన్
మండిత మాచు శోభితసుమంచిరభాసురవక్త్రియుక్తమై
దండిగఁ బొల్చుసద్ధయురదంబముచే విలసిల్లు నద్దియున్. ౧౩౬

తే. గీ. ప్రతతపార్శ్వద్వయస్థేభ ♦ పంక్తి దయిన
కలశనిభతరంగికుంభాళి ♦ ఘనసునీల
రత్నతోరణాభపరస్ప ♦ రకలితోర్ధ్వ
ముఖసుకుంచితాగ్రకరాళిఁ ♦ బొల్పునదియు. ౧౩౪

తే. గీ. అమరఁ బ్రాగ్గుణికాంగనా ♦ త్యంతచిత్ర
రత్నభూషణోజ్జ్వలితవ ♦ రచరణజిత
రంగకాంతియు నై నయా ♦ రాజవీథి
మదనశరరూపుఁ డరిగెఁ జూ ♦ మందగతిని. ౧౩౫

సీ. మధ్యసంస్థాపిత ♦ మాధవంబు దరస్మి
తోల్లసత్సేనసం ♦ చయము సతత
సంచలచ్చామర ♦ సంచయోర్మిగణంబు
వితతాతపత్రక ♦ వివిధకమఠ
మృగణితేభాశ్వప ♦ త్త్యావృతంబును సువీ
ణావేణురవగర్జ ♦ నంబు మఱియు
మిళితపంచన్నాని ♦ మిషయుతం బంతరా
గతమహీశబలౌఘ ♦ ఘనసదంబు
శౌరికీర్తిప్రభాక్షీర ♦ పూరితంబు
మోదదవిదర్భజాస్యచం ♦ ద్రోదయంబు
విమలజయలక్ష్మీనిలయంబు ♦ విపులతరము
నై యమరె మాధవచమూసు ♦ ధాబ్ధి యప్పుడు. ౧౩౬

మ. జలజాతాశ్వరథేభపత్తితతిచే ♦ సంజాతమై వృత్రజి
న్నిలయంబుం దయ మీరఁ జొచ్చురజమా ♦ నీలాంబుదశ్యామసం

గిలసత్సచ్చిదచిత్సుసంగభజకుల్ ♦ గీర్వాణలోకంబు ని
ట్టులె మాహాత్మ్యకులయ్యుఁ బొందుదురు చూ♦డుం డంచుఁ దెల్పెం
[దనగ. ౧౪౦

తే. గీ. సాగరుం డూర్మికరధృత♦శంఖచక్ర
ములసముద్రుఁడై సితఫేన♦ముల సమీప
భూమిఁ బఱిచె వస్త్రావళి ♦ మురవిరోధి
యరుగుత్రోవలఁ బఱిచె నా ♦ సపుడు గూర్మి. ౧౪౧

( మూలమాధవవన వర్ణనము. )

మ. హరినీలాశ్మసుశోభిపత్త్రివృతముల్ ♦ వ్యాలంబిపుష్పస్ఫుర
ద్వరముక్తాసర ముల్లసత్కిసలయ♦ప్రవాతోజ్జ్వలం బెన్న సా
గరసంప్రేషితరత్నశోభితల మిం♦కం గాంచనస్తంభసుం
దరమై సన్మణిమండపాసుకృతి యా♦త త్తత్సువృక్షాళితోఁ. ౧౪౨

మ. అనిశాలంబిఫలావళుల్ కలపికా♦వ్యారబ్ధసంగీతముల్
ధ్వనదంభోనిధిమర్దలంబు శుకరా♦వస్తోత్రముల్ భృంగగీ
ర్ఘనవీణారవముల్ సుకేకినటులుం ♦ రాజిల్ల మాంగల్యవే
శ్మనిభం బౌచుఁ బతత్సుమాక్షతల నా♦చంచద్వనం బొప్పెడుం.

తే. గీ. ఒనరఁగఁ బ్రియాంగపరిరంభ♦ణోత్సవంబు
నిందిరాదేవి తొలుదొల్త ♦ నెచటఁ బొందె
నాస్థలమునె స్థలజ్ఞు లో♦నఖలబుధులు
మూలమాధవక్షేత్ర మం ♦ చోలి ననిరి. ౧౪౪

( వివాహోపక్రమణికా వర్ణనము. )

క. కొందఱు భైష్మీపక్షము
కొందఱు హరిపక్షము నృప♦కులులు సదారుల్

పొందిరి మఱి కడలియు మి
న్నందె రమాపతి మేనం టం చప్పుడఱచెన్. ౧౪౫

తే. గీ. రత్నమయపూర్ణరవివర్ణ రమ్యవరసు
వర్ణపాత్రోత్కరముల సత్కర్ణపత్రి
ముఖ్యశోభనవస్తుసంపూర్ణములు గఁ
జేసికొను చెల్లపనులు కైసేసికొనుచు. ౧౪౬

క. చిత్తంబు లలర నృపతులు
ముత్తైదువ లఖిలవాద్యములధ్వనులు దిశల్
హత్తుకొన వధూగృహమున
కత్తఱి శుభగీతు లమర నరిగిరి వరుసన్. ౧౪౭

ఉ. ఆమెడ నిశ్చితార్థమున కావిధిఁ జేరినయార్యు లెల్లఁ దా
రాయువతీయువాంగఘటనైకవిచారము సేయ మాధవుం
డాయువతీసుపీనకలశాభపయోధరమధ్యదేశ మే
ఘేమెడఁ జూచినం దనకు నెంతయు దుర్ఘట మంచు నెంచె బో.

తే. గీ. కన్యఁ గనకదామకదంబగౌరి భైష్మి
నీయఁ దగు ధన్య యాహరి కింద్రనీల
భాసి కితఁడు విద్యుల్లసద్వారిదాభుఁ
డై పుమర్థాళి వర్షించు నరయ మీకు ౧౪౯

తే. గీ. సతి విదర్భవంశోదధిజాతరత్న
మాతఁ డుడునాథవంశోద్భవైకభూష
ణుండు వీరలయోగంబు మండితమగు
చమరెడుఁ బరంపరాయోగ్యమైనకతన. ౧౫౦

తే. గీ. పావనాంగి పద్మాలయ భైష్మి సిర
దాభుఁ డల్ల నారాయణుఁ డంచుకతన

సమరఁ దమ్యుక్తి సుస్థిరం ♦ బని తలఁచెద
నెసఁగ నన్యోన్యసువిభూతి♦హేతు వగుట. ౧౫౧

వ. అని యిట్లు వరపక్షుగు లభ్యర్థించిన వధూపక్షుగు లిట్లనిరి. ౧౫౨

సీ. యాదవనాథుఁ డేయెడల ♦ నైనను భైష్మికిఁ గష్ట మియ్యఁగా
రా దొకనాఁడునున్ విడువ ♦ రా దొకనాఁడును గోపగింపఁగా
రా దటు లేని యీతఁడు క♦రగ్రహణం బొనరించుఁ గాత స
మ్మోదముతోడ మానుగుణ♦భూషణ మాసరసీరుహేక్షణన్.

తే. గీ. దేవికి సపత్ని తగదు సం♦దేశమున న
పంప వలయును సర్వదా ♦ బందుగులను
సర్వద స్మరించునది యిట్లు ♦ సమ్మతించి
తేని మాకన్య నిను వరి♦యించుఁ గాత. ౧౫౩

వ. అనుటయు వరపక్షుగు లిట్లనిరి. ౧౫౪

మ. అల బ్రహ్మాండము శౌరి కిల్లు పదునా ♦ ల్గా మేడలున్ గాంచనా
చలభూధాన్యమణీక్షుసారలవణ♦స్వాదూదదధ్యాదిని
స్థలగేహోచితవస్తురాసు లమరున్ ♦ జుం డందు బ్రహ్మాదిపు
త్రులకార్యంబుల నిండ్ల నెల్ల సతి స♦ద్యుక్తిన్ విచారించుతన్.

తే. గీ. ఇతరుల కసాధ్య మాగృహ♦కృత్య మెందు
గృహిణి కది భారకారి కా ♦ దెన్నఁ దన్వి
యంతయు స్వలోలలీలాక♦టాక్షమాత్ర
మునన నెఱవేర్ప నేరుచు ♦ ముదముతోడ. ౧౫౫

చ. హరి సిరిఁ బాయునే సభల♦యందు రహస్థలి నేనియున్ భవాం
తరములనే ననన్యవిహా♦రక్రమమజ్జనభోజనాళ్యలం
కరణవినోద మాయువతి♦కార్యమ సుం డిఁక నేమి యున్నఁ ద
ద్విరహిత మైనదేశమును ♦ వే యెడఁ బాయును గాక వెంసియున్.

తే. గీ. తనదుభూషణముగ నెంచుఁ ♦ దరుణి నితఁడు
శుభద మైనస్వాంగాశ్లేష♦సుఖ మొసంగు
తన్వి కొసఁగు వంశాద్యాశ్రి♦తం బగుతన
యధరపీయూషమును బ్రీతి ♦ ననవరతము. ౧౫౯

క. కోపింపఁడు జగములయెడఁ
గోపము కల్గినను దేవిఁ ♦ గొనుఁ గౌఁగిటిలోఁ
బాపమతి దేవి హరి నెడఁ
బాపఁ గడఁగుకుమతియెడన ♦ వహియించుఁ గ్రుధన్. ౧౬౦

చ. అల సతి కోపగించునపు ♦ డాతఁడు కేశము నట్టి పాణిజం
బులఁ గుచకుంభపార్శ్వములఁ ♦ బూన్చి క్షతంబులఁ జేసి యంతఁ గో
మలమధురోష్ఠముం గఱచి ♦ మానిని మానము మాని వశ్యఁగా
లలి నొనరింపఁడే యది వి♦లాసమ కాదె తలంప నెంతయున్.

క. అనిశము స్వభక్తగృహముల
కన్నుపఁడు సిరి శౌరి దాని ♦ నడుగరు వారున్
ఘను లఖిలదునకు నర్పణ
మొనరిచి సిరి మరలఁ గోరు ♦ టుచితమె మీకున్. ౧౬౨

క. హరి సిరిని విడిచి యన్యల
వరియించునె పురుషవరుఁడు ♦ పరముఁడు పూర్ణుం
డరయఁగ నక్లేనియు నా
తరుణులయం దేని సిరిన ♦ తా రమియించున్. ౧౬౩

తే. గీ. సర్వదాపరోక్షీకృత♦సర్వవిశ్వుఁ
డెన్న స్మరణీయశీలుఁ డా♦నితఁడు మిమ్ము
నరయ స్మరియించు టది యెట్లు ♦ స్వాంఘ్రియుగ్మ
మును స్మరించిన మీ కిచ్చు ♦ ఘనఫలంబు. ౧౬౪

వ. అనుటయుఁ బ్రహృష్టచిత్తులై యత్తలోదరీపార్శ్వగు లిట్లనిరి.

తే. గీ. హరికిఁ బరిబర్హ మైన ర♦థాశ్వవార
ణాదిబల మియ్య నే నస♦మర్థుల మిఁక
యువతి నిత్తు మింతియె సుమౌ♦హూర్తికులను
దగుముహూర్తంబు నడుగుఁడు ♦ త్వర ననుటయు. ౧౬౬

తే. గీ. వా రనిరి పరిబర్హంబు ♦ బలముఁ గోరఁ
డతఁడు పూర్ణసుఖుం డెందు ♦ నరయ నింక
నల విరించినైరించిము♦ఖామరులకు
ఘనవిభవ మిచ్చుతత్కటా♦క్షంబ కోరు. ౧౬౭

ఉ. వారిముఖంబునన్ విధుఁడు ♦ వారు దరస్మితసద్సుధాంచితుల్
వారికరంబులన్ ద్యుమణి ♦ బల్ కటియందు గురూక్తి మధ్య మ
వ్వారిది కావ్యకాస్పదము ♦ వారిపదాప్తుఁడు మంగళుండు న
వ్వారిపదంబు కేతుగము ♦ వారిగతుల్ తగ మాంద్యగంబు లౌ.

చ. ముదితలు కాంత్యధఃకృతత♦మోమహిముల్ కద వారు వెండి త
ద్వదనము చూడఁగాఁ గలుగు♦వారికిఁ జంద్రబలంబుఁ దారమున్
బదిలముగాఁ బఠింపఁ గల♦వారికిఁ దారబలంబు నిచ్చు స
ద్విదితుల కేక్షణంబును మ♦దిం దలఁపన్ సుముహూర్తమే యగున్.

తే. గీ. తెలియ జ్యోతిష్పథజ్ఞోక్త♦తిథుల ద్విత్రి
దినము లెన్న నుద్యన్మహ♦ర్ద్ధిని దలంప
వలయు జనులకు మఱి క్షణా♦భంబ నైన
భైష్మి కది కల్పరూపమై ♦ భీష్మ మగును. ౧౭౦

తే. గీ. క్రముకయుక్తతాంబూలప♦త్త్రిమె వివాహ
ఘనశుభోత్సవసూచక ♦ మని తలఁచెద

మదియ తత్తరుణీతరు♦ణ్యైకవిహిత
పరమమాంగల్యదీక్షోత్స♦వద మనుటయు. ౧౭౧

తే. గీ. అంతఁ గ్రమముగ నుభయవ♦ర్గాబ్జముఖులు
గృహగృహంబులఁ దగ సహా♦రిద్రలై ల
ముసు వివాహమహోత్సవ♦మూలభూత
మిచ్చిరి పరస్పరస్నేహ ♦ మిచ్చి యనఁగ. ౧౭౨

తే. గీ. మఱుదినము కన్యకావరుల్ ♦ మాన్యులర్థ
కాములై పితృదేవతా♦గణసమర్చ
లొనరిచి తదగ్రమంద చీ♦ర్ణోత్సవులుగ
నుంట నన జాతలజ్జులై ♦ యొప్పి రపుడు. ౧౭౩

తే. గీ. అంత స్నాతకసాధర్మ్య ♦ మవధరించి
యల్ల యదునందనుఁడు తీర్థ♦యాత్ర కరుగఁ
గడఁగ రుక్మిణీపతుగా♦గ్రణి యొకండు
హరిని వారించె నపుడు తా ♦ ననునయోక్తి.

చ. హరి భవపాశమోచన మ♦హామతి శ్రీయుత తీర్థయాత్రకై
యరుగుట లేల నిల్వు మర♦యన్ జనునప్పుడు నీపెఱుంద నీ
చరణము సోఁకుచోటులు భృ♦శంబుగఁ దీర్థము లౌ నటుండఁగా
సురనుతచర్య నీయెదుటఁ ♦ జొప్పడ నెయ్యది యుండుఁ జెప్పుమా. ౧౭౪

తే. గీ. ఈశ తీర్థ మాడఁగఁ గోరి ♦ తే నట నటఁ
బొనర నభిషేక మొనరింత్రు ♦ మునులు నీకు
జలగతుఁ గఁ జేయు చుందురు ♦ లలి వివేక
మలర నిన్నింకఁ దీర్థాళి ♦ నరయ నేల. ౧౭౬

తే. గీ. సంధ్య నీగుణకీర్తన♦నర్తనాదు
లెచట నచటన తీర్థంబు ♦ లెసఁగు సుజనుఁ

డెవ్వఁ డచ్చట స్వసుకృతం ♦ బెల్ల నీకు
నర్పణము సేయుఁ బూర్ణుఁడొ ♦ నతఁడు చూవె. ౧౭౭

చ. జలరుహనాభ నీచరణ♦సంగతి స్వస్సరిదాదితీర్థముల్
తలఁపఁ బవిత్రతం బడసెఁ ♦ ద్వచ్ఛుభదాంగచయానుషంగస
త్ఫలభజదంతరంగయుత♦భక్తులచేతను వెండి పూత మా
నిల నిఁక నట్టితీర్థముల ♦ నే మని క్రుంకఁగఁ గోరె దిచ్చలోన్.

చ. అరయ నజాండకర్పరగ♦తాయుతకోటిసుతీర్థపాళి నీ
నిరుపమరోమకూపమును ♦ నిఁపఁగఁ జాలదు గంగ యేని నీ
చరణనఖంబునం దడపఁ ♦ జాలదు సుమ్మిఁక నెట్టితీర్థమం
దు రమణఁ గ్రుంకఁ బోయెదవు♦ దోషవిదూర రమాధినాయకా.

మ. అల భ్రూకాశిని నాభిమానసవతిన్ ♦ హారావళీగంగ ని
స్తులనీవీసుసరస్వతిన్ బ్రవిలస♦ద్రోమార్కజన్ భైష్మినిన్
లలిఁ గాంచీజఘనన్ గుచోచ్చబదరిన్ ♦ లక్ష్యద్వ్యపాంగప్రభా
తులకావేర్యగమధ్యగేందుసరసిన్ ♦ దోఁ బొందినన్ యాత్ర యౌ.

తే. గీ. దేవ మూలమాధవమున ♦ దేవిఁ గరము
వట్టి జగదప్రతిమతీర్థ♦వర్య మాచుఁ
బరఁగఁ జేయుము దానిని ♦ వ్యాప్త యింక
యాత్ర వేఱొండు మే మొప్ప ♦ మనఘచరిత. ౧౮౧

వ. అనుటయు నయ్యదునందనుండు యాత్రాగమనవినోదం బుజ్జగించి.

తే. గీ. వేడ్క నిత్యనిజోరుస్థ♦భీష్మకాత్మ
జాఘనోత్తుంగనృత్యత్కు♦చగ్రహవిధి
విఘ్నశాంతికై యను నట్లు ♦ విభుఁడు శౌరి
కడఁక నొనరించె గ్రహశాంతి♦కర్మ మంత. ౧౮౩

## (బ్రహ్మాది దేవతా వర్ణనము.)

వ. అంతఁ దత్పరిణయమహోత్సవవీక్షణాయత్తచిత్తంబుల స్వయంభు
ప్రముఖామరు లేతెంచి సభ నలంకరించిన నప్పుడు రుక్మిణికిం దత్స
ఖీమణి వారలం జూపి యందు బ్రహ్మం బేర్కొని యద్దేవి కిట్లనియె.

మ. మును కల్పాంతజలంబులం గమలతో ♦ భోగీంద్రతల్పంబునం
దనరన్ వేడ్క వసించి భక్తజనబృం♦దంబుల్ దగం గొల్వఁ బొ
ల్చిననారాయణునాభినుండి యుదయిం♦చెం బద్మ మొం।డందు నీ
యనఘాత్ముం డల పద్మయోని యనఁగా ♦ నబ్జాక్షి పుట్టెం జుమీ.

మ. అనయం బీతనితండ్రి యా మురరిపుం ♦ డాత్మాభిధుండన్ స్వయ
మ్మను పేరం జనువాఁ డవాచ్యుఁ డగుటన్ ♦ హంసాశ్వు నీయబ్జజున్
మునిముఖ్యుల్ దగ నాత్మయోనియు స్వయం♦భుం డం చజుం
[డంచు నా
త్మను వేదాప్తిని వేదగర్భుఁ డనుచున్ ♦ దర్కింతు రిచ్చన్ సఖీ.

తే. గీ. అల మహాద్రిసంఘాతశ♦తాతతాంబు
వుల నదృష్టసద్విష్టర♦జలజమూలుఁ
డై విధిజ్ఞుఁడు విధి తండ్రి ♦ నరయఁ గోరి
తద్విజితాత్మవృత్తియై ♦ తపము సేసె. ౧౮౭

తే. గీ. లీల నంబుకల్లోలవి♦లోలడోల
ఫణసహస్రసురత్నాంశు♦గణతృణీకృ
తార్క్షవిధులక్షలక్ష్మియై ♦ యలరునట్టి
నాగకులసార్వభౌముస♦ద్భోగశయ్య. ౧౮౮

తే. గీ. సింధుపుత్త్రికతోడ వ♦సించి।యలరు
నీరజాయతేక్షణుఁ గమ♦నీయపరస

హస్రదోర్దండభాసితు ♦ సజుఁ బ్రవాల
సుమృదుపాదారుణీకృతా ♦ శుఁ గనె నితఁడు. ౧౮౯

తే. గీ. శుభసువర్ణవర్ణాంబర ♦ శోభిమధ్యు
మొగి నగణ్యలావణ్యస ♦ ముద్రహృద్యుఁ
గనె విశాలసీలాచల ♦ కల్పు మంద
సత్స్మితాననాధఃకృత ♦ చంద్రదర్పు. ౧౯౦

తే. గీ. హరిఁ బరిస్ఫురత్కుండల ♦ హారకాంచి
కాకిరీటముద్రాంగదా ♦ గణ్యశౌర
ణాదిభూషణశోభు స ♦ హస్రరశ్మి
శతలసద్గాత్రభాసిత ♦ సర్వదేశు. ౧౯౧

తే. గీ. సుఖ విశాలవక్షఃస్థల ♦ శోభిరత్నుఁ
జిరసుభక్తివినమ్రులు ♦ చిత్రభూష
ణాళిభూషితాంగు లగుబ ♦ లారిభాను
ముఖులచే వంద్యుఁ డౌదేవ ♦ ముఖ్యుఁ గనియె. ౧౯౨

శా. ఉన్నాలాబ్జవరాతపత్త్రి సహిరా ♦ మున్నమ్రసింహాసనున్
సన్నద్ధోజ్జితముక్తభృత్యనికరున్ ♦ సాంద్రోర్మిసచ్చామరున్
దన్నాదాభిధమందుభిన్ శుభయశ ♦ స్తత్యుక్తులన్ నీలదే
హు న్నారాయణచక్రవర్తిని నితం ♦ డుస్మేలితాక్షున్ ఘనున్.

తే. గీ. వందిపగిదిని వినుతించి ♦ భక్తి నల ర
మారమేశానుమతిని స ♦ మస్తసృష్టి
సేసి తత్స్మృతి ధన్యుఁడై ♦ చెలఁగి భక్త
వర్యులకు నగ్రగణ్యుఁడై ♦ పరఁగె నితఁడు. ౧౯౪

వ. అని జగత్ప్రాణుం బేర్కొని యిట్లనియె. ౧౯౫

తే. గీ. అతఁడె సకి సుమ్ము ప్రాణగ♦ణాధినాథుఁ
డఖిలగుణముల సముఁడు స్వ♦యంభువునకు
మును శివాదుల శ్రేష్ఠత్వ♦ఘనవివాద
మున స్వసత్త్వము ప్రకటించె ♦ ఘనుఁ డితండు. ౯౬

వ. అని యహిభూషణాహిపాహిరిపులం బేర్కొని యి ట్లనియె. ౯౭

తే. గీ. శర్వుఁ డితఁడు సురారిసం♦చయవిభేద
దక్షుఁడు పురత్రయంబును ♦ దగ్ధ మయ్యె
నితనిచే విష్ణుపదతీర్థ ♦ మితఁడు దాల్చె
సతి వశునిఁ జేసికొనియె న♦సాధ్యు నితని. ౯౮

మ. సకి శేషుం డిదె వాయుకూర్మతనుపృ♦ష్ఠంబందుఁ బుచ్ఛంబు నుం
చి కుభృద్భూజసరిత్సముద్రనగర♦క్షేత్రాదిసంపూర్ణ మా
సకలం బెన్న సుపృథ్విఁ బృథ్వి నిసమం♦చచ్ఛక్తిభోగాతప
త్రికమ్గం దీతఁడెసుమ్ము దాల్చె నవికా♦రప్రక్రియం గోమలీ. ౯౯

చ. వినత సుపర్ణుఁ డీతఁ డహి♦వర్ణ్యబలుండు గరుద్భవోన్మరు
ద్ఘనజవచాలితాద్రితరు♦కంధిసమూహుఁడు మున్ను గోమద
ద్రిని రణమందు మాధవుకి♦రీటము దొంగిలినట్టిదానవుఁ
ఘనబలుఁ ద్రుంచి తెచ్చి ఘన♦కాయుఁ డొసంగె సురారివైరికిన్. ౧౦౦

వ. అని దిక్పాలురం బేర్కొని యి ట్లనియె. ౧౦౧

తే. గీ. సకి త్రివిక్రమశ్రీపాద♦సత్ప్రసాద
మునఁ ద్రివిష్టపనాథుఁడై ♦ పొనరు నితఁడు
క్షీరవారిధిఁ దచ్చి వి♦చిత్రభాగ్య
వృతుఁడు గావింపఁబడె నింద్రుఁ ♦ డతివ యితఁడు. ౧౦౨

తే. గీ. కల్పతరువు కరివరము ♦ కావ్యవర్ణి
తాశ్వమును గల్గి సభను సిం♦హాసనమున

నింద్రపదయోగ్యసువిభూతి ♦ యీతఁ డభివ
సించి దేవతాసభను బా♦లించు చుండు. ౨౦౩

క. ఇతఁడు సురగురుఁడు ధర్మం
డితఁడు సహస్రకరుఁ డెన్న ♦ నితఁడు సుధాంశుం
డితఁ డల రత్నాకరుఁ డన
నుతి గనువాఁ డండజేం గ♦నుంగొనుము సఖీ. ౨౦౪

వ. అని యిట్లు చూపి చెప్పిన నిజమూలరూపవాసనావిశేషంబున లోక
మాత యగుట వారలం బుత్రపౌత్త్రభృత్యాదిభావంబునం బరిత్య
జించి యాహరిమధ్య హరిపార్శ్వంబునకై మొగంబుఁ ద్రిప్పిన నప్పు
డాసఖీమణి యతనిం జేర్కొని యిట్లనియె. ౨౦౫

తే. గీ. అబల చిత్ప్రమోదమయావ్య♦యాంగుఁ డఖిల
దోషశూన్యుఁడు గుణసము♦ద్రుఁడు ముకుందుఁ
డితఁడు సర్వసజ్జనపాల♦నేచ్ఛ భూత
లమున నుదయించెఁ జూడ్వె యీ♦సుమహితుండు. ౨౦౬

తే. గీ. అల జగజ్జనిస్థేమల♦యాదిధర్మ
ము లవి విశ్వయోని యగునీ♦పురుషువలన
నగు నెవనిరోమకూపాళి ♦ నబ్జజాండ
యుత మతని సముఁ డెవఁడు దే♦వతలలోన. ౨౦౭

తే. గీ. సేతిహాసపురాణస♦త్స్మృతులు సకల
వేదములు క్షీరనిధి నుద్భ♦వించినసిరిఁ
బడసినసమానశూన్యునిఁ ♦ బ్రభుని వరదుఁ
దెలుపుచున్నవి వింటె సం♦తీలలామ. ౨౦౮

తే. గీ. ఆహరిపదాబ్జ మండక♦టాహభేది
జలజయోనిహస్తార్ఘ్యణ♦సారవేది

న్మై రహించెడు వివిధాన♦తారశమిత
భూమిభారుఁ డితండు పూఁ♦బోఁడి వినుము. ౨౦౯

మ. అల బాలగ్రహరూప పూతన విషం ♦ బానించువేళన్ వ్రజ
స్థలి బాలగ్రహరూపుఁ డౌనితనిచే ♦ సంపీడనం బొంది వ్యా
కులతన్ దాన విషాగ్నిఁ గ్రాఁగె జగతిం ♦ గ్రోధాత్ములై వే మహా
త్ములకుం గీడు తలంచి తార చెడి పో♦దు ర్గాదె దుష్టాత్మకుల్.

మ. శకటాకారి సురారి విష్ణుపదసం♦స్పర్శంబునన్ స్వస్వరూ
పకుఁడై పైఁ జని యద్ది విష్ణుపద మన్ ♦ భ్రాంతిన్ బడెన్ బృథ్వి వా
రక యావిష్ణుపదాప్తి మాయ పొలుపా♦రన్ నిల్చునే దైత్యజా
తికి బుద్ధుల్ విపరీతవృత్తు లగుఁ గా♦దే నాశకాలంబునన్. ౨౧౧

సీ. పరివృత్తనేత్రుఁడై ♦ పనవె రజోవృత
భ్రాంతవ్రజజనాక్షి♦పద్ముఁ డగుచు
మొగిని మూర్ఛాభ్రాంత♦మూర్ధుఁ డయ్యెను గృత
వ్రజజనమూర్ఛనా♦వస్థుఁ డగుచుఁ
గ్లేశావృతుం డయ్యెఁ ♦ గృతపరవ్రజసాధు
జనమానసక్లేశ♦సంఘుఁ డగుచు
శైలాగ్రపతితుఁడై ♦ చచ్చెను గృతనంద
గేహినీవరసుత♦క్లేశుఁ డగుచు
హరిని హరియింప నరుదెంచి ♦ యాసురాసు
రాశి యన మరుదాకృతి ♦ క్రీశుఁ గొంచు
మింటి కెగసి యోర్వఁగ లేక ♦ మేదినిపయిఁ
బతితుఁ డౌచుఁ దృణావర్తుఁ ♦ డతివ వింటె. ౨౧౨

పంచచామరము. స్వరక్ష్యవత్సవేషధారి ♦ వత్సదైత్యు శౌరి తాఁ
గరంబులం గ్రహించి యూర్ధ్వ♦గమ్యుఁ జేసె వాఁడు తాఁ

గరంబు మాయఁ గొల్చువాఁడు ♦ కానఁ గూలెఁ గ్రిందికిన్
మురారి కడ్డి ధర్మ మౌ వి♦మోహి కడ్డి ధర్మ మౌ. ౨౧౩

తే. గీ. అల సరత్నకృష్ణాహిఫ♦ణాంగణముల
గరుడకరముఖ్యదైవ మౌ♦వరపదమున
గరము గ్రక్కింపఁగా నసఁ ♦ గడిమి నర్త
నంబు సేసె నీకృష్ణుఁడు ♦ నళిననేత్ర. ౨౧౪

మ. ఘనదుర్గాటవి నందునిన్ బ్రతి క్షుధన్ ♦ గాంక్షించి వ్యాళంబు ప
ట్టిన నందున్ విడిపించి శౌరి యఘ మ్మూ♦ర్ఛ్ఛం దాని కంతన్ సుద
ర్శననాముండు తదాఖ్య సార్థకము గాం♦చన్ జేరె విద్యాధరుం
డెనయన్ విష్ణుపదంబు విష్ణుపదమం ♦ దెన్నం గృతజ్ఞాత్ముఁడై.

వ. హరి యల కుబ్జపాదముల ♦ స్వాంఘ్రిసరోరుహాఫుల్లపుష్పముల్
సరణిగఁ జేర్చి యంగుళుల♦సంగతిఁ దచ్చుబుకంబు పట్టి తాఁ
బరువడి నెత్తి దానితను♦వక్రత మాన్చెను మానినీజనో
త్కరగురువక్రతాహరణ♦కారివిధిజ్ఞుఁడు కాన వేడుకన్. ౨౧౫

తే. గీ. కువలయాపీడమును బట్టి ♦ కొసరి విసరి
ధరణిఁ బడఁ గూల్చి దానిదం♦తములు వెఱికి
వానిచే దానిమాష్టీనిఁ ♦ బరిజనాళి
తునిఁగ నిలఁ గూల్చె నరసింహుఁ ♦ డొనర నితఁడు. ౨౧౬

తే. గీ. వినుము మాతులరణయాత్ర ♦ విఘ్న ముడుగఁ
బూర్ణబలు లిచ్చి రన నప్డు ♦ పూర్ణబలులు
కృష్ణబలు లహిదర్పన♦హిష్ణులు తఱి
గి రటఁ జాణూరముష్టికా♦సురులతలలు. ౨౧౭

మ. నరకావాసము చేరుమాతులునకుం ♦ దా మున్న సేవార్థమై
పరఁగన్ దాదిని వాతమున్ శకటమున్ ♦ పత్యంబునున్ ధేనుకున్

సరగన్ గట్టిము నేనుఁగున్ రజకునిన్ ♦ జాణూరముఖ్యాళి మ
ల్లురఁ సేనావళిఁ బంచి మామ ననిచెన్ ♦ లోకేశ్వరుం డర్మిలిన్.

క. పంచజనుని యముఁ జేరఁగఁ
బంచి కొనియెఁ బాంచజన్య♦వరశంఖము వే
పంచజనవిరహితంబుగఁ
బంచజన్యవపువు జలధియుఁ♦ బరముఁడు సేసెన్. ౨౨౦

ఉ. పంచజనాఖ్యప్రాణములఁ ♦ బన్నుగ మున్ యముఁ జేర దూతలం
బంచి కడంక నేగి గురు♦బాలునిఁ దె మ్మటు గాక తర్గతిన్
గాంచె ద టంచుఁ దెల్పె ననఁ♦గాఁ బురివాకిట వే దరంబు పూ
రించి యముం దొసంగఁ గొని ♦ కృష్ణుఁ డొనర్చె గురున్ సపుత్రుఁ
[గాన్. ౨౨౧

తే. గీ. భీష్మసుత యంత సఖియు వి♦వేకసఖియుఁ
గలప ధృతమాలయై యూర♦కయ నిలిచెను
గృష్ణునే యల్ల సతి వరి♦యించె ననుచు
దాని హర్షచిహ్నంబులు ♦ తద్ద దెలిపె. ౨౨౨

మ. ఇతఁ డుగ్రుం డతిచంచలుం డితఁడు తా ♦ వృద్ధుం డితం డీతఁ డీ
క్షితి గోత్రాసహుఁ డీతఁ డౌ జ్వలనుఁ డి♦స్సీ వక్రితుండుం డితం
డితఁ డెన్నం దపనుండు సుమ్ము జడపుం ♦ డీతండు గూఢాంఘ్రి యీ
గతిఁ దా ధిక్కృతదేవయై తరుణి శ్రీ♦కాంతున్ వరించెం దమిన్

సీ. వనరుహాగర్భుండు ♦ వైదికగ్రామణి
జపశీలుఁ డనిలుండు ♦ సంతతంబు
శర్వుఁ డెన్నఁగ నెప్డు ♦ సవిరాగచిత్తుండు
సాంసారికసహాయుం ♦ డమరభర్త

సూర్యుఁడు తా నెప్డుఁ ♦ బర్యటనేష్టుండు
కోకాహితుండు దో♦షాకరుండు
అంగజుఁ డెన్న న♦నంగుండు మఱియును
శేషుం డకర్ణుండు ♦ సిద్ధ మిదియు
పక్షపాతి ఖగేశుండు ♦ పరఁగ యముఁడు
ప్రేతపతి బాపురే జడ♦ప్రియుఁడు వరుణుఁ
డంచుఁ దర్కించి తరుణి యా♦యమరగణము
మది నుపేక్షించి వరియించె ♦ యదుకులేశు. ౧౨౪

మ. వరుసం జంపకయుక్తిఁ బద్మనిధికిన్ ♦ బద్మాప్తిఁ గోకాలికిన్
వరనీలోత్పలయుక్తి సూర్యునకు దూ♦ర్వాప్రాప్తి నాగాలికిన్
అరయం గైతకయుక్తి శూలికిఁ దుల♦స్యాప్తిం గణస్వామికిన్
బరఁగన్ యోగ్యముకాక మాల యల రెం♦ బద్మాక్షమాత్రార్హమై.

తే. గీ. తలఁపఁగ హరిప్రసాదభో♦క్త లగు నీసు
రాలి కీసుమాలిక నియ్య ♦ నగు నె యనుచు
భామ తాఁ బ్రమోదోత్థిత♦రోమరాజి
యై సమర్పించె దాని నా♦రాయణునకు. ౧౨౬

( రుక్మిణీకృష్ణుల వివాహ వర్ణనము. )

తే. గీ. తన్ముహూర్తావధిగ మధ్య♦దత్త మైన
పటము భేదించి యొండొరు♦ప్రభలు వారిఁ
దాఁకుచుండె నెప్డు నఖండి♦త మగుయోగ
భాగ్య మిట్టి దనుచు జ్ఞాన♦వంతు లెఱుఁగ. ౧౨౭

చ. జనకసుతాస్వయంవరవి♦శాలమహోత్సవగీతు లైదువల్
ఘనమతిఁ బాడ రుక్మిణికిఁ ♦ గల్గుగగుర్పలు కృష్ణుఁ డప్పుడోం

దినదరహాస మెల్లరకుఁ ♦ దెల్పెను భైష్మియ సీత కృష్ణుఁడే
యినకులుఁ డివ్వి పేరికథ ♦ లే కథ యేమిటఁ జిత్ర మంచు చటన్.

ఉ. అంతఁ బటంబు దీయఁగ ర♦యంబున నొండొరుఁ జూచువేళ న
య్యంతిముఖాబ్జ మొందె జల♦జేక్షణు నేత్రము కాంతకన్నులా
స్వాంతజరూపునాభికమ♦లాకర మొందెను భానునేత్రుఁ డ
క్కాంతుఁడు నుత్పలాక్షి యల ♦ కామిని కావున నద్ది యుక్తమా.

తే. గీ. కడఁక గుడయుతశుభజీర♦కములు బంధు
చయము వారలపైఁ బోయు♦సమయమందు
క్షీరధిసుతాజితుం డగు♦శ్రీహరి యల
తరుణిపక్షమువారివి ♦ తాల్చె మొదల. ౨౩౦

తే. గీ. కాంత కాంతున కాపాద♦కంఠముగను
సత్కటాక్షనీలోత్పల♦చారుమాల
నొసఁగెఁ గాంతుఁడు తత్క్షణం ♦ బొనర హృష్ట
రోమసత్కంచుక మొసంగె ♦ భామ కపుడు. ౨౩౧

మ. ప్రియ ధారాంబుచయంబుతోఁ దడిపె సు♦ప్రేమాశ్రుధారన్ [సుమో
చ్చయహాసం బునిచెన్ మెడన్ బ్రణయ మన్♦సన్మాల నేత్రాంతదృ
క్చ్ఛయనీరాజన మిచ్చె సుస్మితసుధన్ ♦ జాల న్నివేదించె నా
ప్రియు నీరీతి భజించి పొందె ఫలమున్ ♦ వే పార్శ్వగత్వంబుతోన్.

తే. గీ. సరగ సమలంకృతాంగు లౌ♦సతులు గీత
తతి శుభకథలఁ గుంకుమా♦క్షతలు చల్ల
స్వర్ణపీఠస్థు లావధూ♦వరు లొసఁగిరి
సదయదృష్టుల వారి క♦క్షతఫలముల. ౨౩౨

తే. గీ. అల వధూవరుల్ గమ్యర♦హస్యగోష్ఠి
నాస్యగాగ్ని నాత్మీయుఁగా ♦ నమరఁ జేయ
నవఁగ లాజసమేధితా♦గ్నిని గృహీత
కరులయి ప్రదక్షిణంబు సే♦సిరి ముదమున. ౨౩౮

తే. గీ. ఎలమి నాలవదినమున ♦ హృష్టు లగుచుఁ
దల్పతనుఁ డయి శేషుండు ♦ తమరతార్థ
మిటఁ జిరము నిల్వ వహియింపుఁ ♦ డిల నని దిగి
భంబులను వేఁడి రస నాగ♦బలి సలిపిరి. ౨౩౯

మ. హరి కల్పించె స్మితాఖ్యతారము నపాం♦గాశ్వాళులన్ హృత్పరం
బురువక్షోరుహకుంభిఁ గాయకనక♦ప్రోద్భూతరోమప్రజన్
హరిసంసక్తమనోరథంబు వివిధాం♦గాభోల్లసద్వస్త్రముల్
హరియోగ్యామృతసాధనాధరధరన్ ♦ హస్తంబుతో నింతి తాన్.

తే. గీ. నరులు నారులు నాస్వాయం♦వరమున స్ఫుర
దంగలేపులు స్మితశోభి♦తాస్యు లుజ్జ్వ
లత్కలాపులు చిత్రవ♦స్త్రోత్కరయుతు
లగుచును జరించిరి వధూవ♦రాభు లగుచు. ౩౭౨

క. దుర్గమ మగుద్వారకపురి
భార్గవితోఁ గృష్ణుఁ డంత ♦ బలహుఁడు శచితో
స్వర్గమును బోలెఁ జొచ్చెను
స్వర్గినికరగేయమాన♦చరితుం డగుచున్. ౨౩౮

( సముద్ర వర్ణనము. )

తే. గీ. స్వవరఫేనకాంతిని సిత♦పార్శ్వయుగ్మ
మార్ద్వశిఖల సుకీతవః♦ధ్య మిఁక నన్ని

యెడల నసితంబు నై యొప్పి ♦ కడలి భూత
ధాత్రికి విచిత్రవస్త్రమై ♦ తనరెఁ జూడ. ౨౩౯

తే. గీ. తగ నసహ్యావహిష్ణువ్యథి ♦ తంబ యయ్యెఁ
గడలి బహురత్నములఁ దాల్చెఁ ♦ గడుపునందు
నింత పానీయ మే నొల్ల ♦ కీయకు ధన
లాభునకు నెక్కుడౌఁ గద ♦ లోభ మరయ. ౨౪౦

తే. గీ. మొగి సరిత్పతి తన్ముఖ ♦ మునను వడి వి
వేకహీనుఁడై కడచెడు ♦ వేల యదియ
కాదె స్త్రీయుక్తులకు వివే ♦ కం బ దెచట
వేల యెచ్చటఁ దలఁపంగ ♦ విశ్వమందు. ౨౪౧

తే. గీ. నది బహూపయోగ్యత నొంది ♦ నను సముద్రు
కడఁ జెలంగుఁ గంటకితో ♦ పకంఠరీతి
స్వైరిణులు గూఢతరభోగ ♦ సాధ్య లయ్యు
భర్తయెడ సదాచారసం ♦ పన్నల కద. ౨౪౨

మ. సలిలేశుం డల స్వీయదిగ్యువతి నో ♦ జం గూడి సన్మిత్రు నే
ని లలిం జంద్రుని రక్తుఁడై యడఁగు వా ♦ నిం జూచుచుం సమ్మదో
జ్జ్వలుఁడై పొంగెను నట్లు కాదె జగతిం ♦ జర్చింపఁగా మైత్రి యొ
క్కలతాంగిం మదిఁ గోరునిర్వురకు జో ♦ కం నిల్చునే యేరికిం.

చ. అనిశము కాలసన్నిభమ ♦ హాబడబానలతప్తగాత్రుఁ డ
య్యును ముదితుండ పోలె నెపు ♦ డుద్ధతి గర్జలనొప్పుచుండు నీ
రనిధి నుఫేనసంచయద ♦ రస్మితకాంతి నభశ్చ్యుగూర్మియై
ఘనుఁడు గభీరభావుఁడు ప్ర ♦ కాశము సేయునె నైజకష్టముల్.

తే. గీ. శౌరి దోషిసఖత్వసం ♦ జాత మాన
సేన్యత హరించె స్వగృహ మా ♦ సింధుపునకు

నేమి చిత్రంబు తలఁపఁ ద♦దిష్టసంగ
మంబె సకలాఘము లడంచు ♦ మహిమ్ని గాదె. ౨౮౫

తే. గీ. మురవిరోధి యజయ్యుండు ♦ మున్నె యిప్డు
డబ్ధిఁ బురిఁ గట్టుకొటను దా ♦ నత్యజయ్యుఁ
డయ్యె స్వకళత్రవస్త్రిక♦తాలయము సనుఁ
జెనక నోపుదు రే యొరు ♦ లనుచు నహహ. ౨౮౬

తే. గీ. శుభ్రరమ్యఫేనాసవ♦శోభివక్త్రిఁ
దైౖ విధూదయమున నూర్మి♦హస్తముల న
దీజఘనముల నంటు న♦బ్ధి యల చంద్రుఁ
గనిన నేరికిఁ గామంబు ♦ కలుగ దొక్కొ. ౨౮౭

తే. గీ. ఒగి సుపీతకృశానుమ♦ధ్యుఁడు సితేత
రుఁడు నదీపరిశ్లిష్టగా♦త్రుండు నగుచు
నుదధి యొప్పెను బహుయోషి♦దుత్కరపరి
తోషదాయి యాకృష్ణుతోఁ ♦ దుల్యుఁ డనఁగ. ౨౮౮

క. ఈరీతిగ మునినాథులు
ద్వారక కేగుచును ద్రోవ ♦ వార్ధిఁ బొగడుచున్
ద్వారవతిని జేరి నిరతం
బారాధించిరి ముకుందు ♦ నతిభక్తిమెయిన్. ౨౮౯

( శ్రీరుక్మిణీకృష్ణుల యవయవ వర్ణనము. )

మ. చిరరక్తస్వతలైకకాంతివిలస♦త్స్వీయోర్ధ్వభాగచ్ఛవిన్
వరచంద్రద్యుతివృత్తసన్నఖరుచిన్ ♦ స్వస్థోజ్జ్వలద్భూషణా
చిరరత్నప్రభఁ మెఱుంగిడులస♦చ్ఛ్రీరుక్మిణీకృష్ణస
చ్చరణాబ్జంబులు సేవ్యముల్ నిఖిలస♦త్సంపత్ప్రదంబుల్ దగన్.

తే. గీ. వరరమాస్తనకుంకుమ♦పంకసంగ
మఖిలమునిమనస్సరసీరుహ♦హంబు మఱియు
నుత్తమమనోజ్ఞనఖమాక్తి♦కౌఘశోభి
తతసురక్తాంగుళీలస♦ద్దలలసితము. ౨౫౧

తే. గీ. తలఁపఁ గ్వణదాస్యహంసక♦దంబజృంభి
మాక్తికోల్లసత్కింకిణీ♦మఞ్జులంబు
తద్వదనజాతకవిగీత♦తతమనోజ్ఞ
లలితలేఖాభరేఖాళి♦లక్షితంబు. ౨౫౨

తే. గీ. విమలబోధరవిద్యుతి♦వికసితంబు
లలి సుజనమాన్యగుణభాజ ♦ కలుషిన్వైరి
రుచిరసౌరభ్యలుబ్ధమా♦నుతనిలయము
రమ్యకారుణ్యమాన్యమ♦రందరుచిరము. ౨౫౩

తే. గీ. నిత్యసక్తస్వసద్భృత్య♦నేత్రనామ
విహితమత్తాళిసంతత♦స్వీకృతంబు
కర్ణికోజ్జ్వలతలకాంతి♦కలితము నగు
హరిపదాబ్జంబు మన్మాన♦సాళివసతి. ౨౫౪

తరువోజ. నిరతశంఖాంభోజ♦నిధుల నిష్టార్థ
నిఖిలదానంబున ♦ నిశితాంకుశంబు
నరయ హస్తిన్యాంత♦రాకర్షణమున
నశనిని సురరిపు♦హరణంబుచేతఁ
బరువడి నిర్జించి ♦ ధ్వజ మున్నతంబు
వడి నెత్తె శ్రీకృష్ణు♦పాదపద్మంబు
సరగ నాయవియు ల♦క్షణగణవ్యాజ
నరణి సేవించె ద♦త్పరసతిలంబు. ౨౫౫

మ. తలఁపన్ ధర్మతతుల్ పరస్పరవిరో♦ధం బొందియున్ శౌరియం
దెలమిం బొల్చెను నం చొగిం దెలుపున♦ ట్లెన్నంగ నాచంద్రమః
కలికావిద్యుతిమన్నఖాంకములు శ్రీ♦కాంతేశుపాదాంబుజం
బులు మాకెప్పుడుఁ గావుతన్ శరణముల్♦మోదప్రదంబుల్ ధరన్.

చ. జలరుహముఁ డిందుఁ డెన్నఁ దన♦శత్రుల మూర్ధమునన్ నఖంబులన్
జలరుహనాభుపాదజల♦జంబులు తాల్చుటఁ గాంచి వైరమున్
జలజకులంబుపై నిలిపెఁ♦ జంద్రు నిజాహితతత్పదాంబుజం
బులు ధరియించె మైత్రి యని♦ పూనె నమిత్రిత యద్ది చంద్రుపై.

మ. కమలాంగీకృతుఁ డెప్పు డుచ్చగతి వే♦డ్కన్ బొంద నా నంచులో
కమునం జాలెనురీతిఁ దొల్తఁ గమలా♦కాంతాకరం బొంది వే
క్రమకీర్తిన్ గుచశైలమూర్ధసుకచా♦గ్రంబుల్ దగం బొందు నా
కమలాక్షాంఘ్రిసరోజముల్ మము సుభా♦గ్యం బొందఁగాఁ జేయు
తన్. ౨౫౮

చ. తరుణవిభిన్నవిద్రుమవి♦తానసుదృక్పరితఃస్ఫురద్రమా
కరకమలాంగుళీదలసు♦కాంతు లొనర్చెను గృష్ణుపాదనీ
రరుహముఁలం దొగిన్ సహజ♦రాజదలక్తకచిహ్నకాంతి బల్
సరణిగ నింత తోఁప హరి♦సన్నఖమండలమండనార్హమున్. ౨౫౯

తే. గీ. పటుల నంతరాపూరిత♦బహ్వనంత
భూరిసౌందర్యశేషసం♦పూర్యమాణ
విశదపృష్ఠోర్ధ్వతలలు సు♦వృత్తలు నగు
వారిజంఘ లెసఁగుత మ♦ద్భావవీథి. ౨౬౦

తే. గీ. అరయ నెనఁడు మున్ నందగృ♦హాంగణమున
జానుసంచరణమున ర♦జస్సు చూర్ణ

ముగ నలిపె నట్టిపూర్ణుండు ♦ మొగి నలుపులఁ
జూర్ణముగ మన్మనోరజ♦స్సును నిరతము. ౨౬౧

మ. అల కాంతిన్ హరినీలకాంచనములన్ ♦ హస్తీంద్రహస్తంబు వ
ర్తులతాధర్మమునన్ మృదుత్వగుణమం♦దుం గుందసంఫుల్లమా
లలనుం బోలుచు నొడ్డయూరువులఁ బో♦ల్పం గాక ద్వంద్వాత్మతన్
జెలఁగున్ వారలయూరుయుగ్మకము ల♦చ్ఛిద్రప్రభావంబునన్.

తే. గీ. అరయ గతనిజలాభంబు ♦ లయ్యె నెపుడు
స్వాశ్రితేందిర కధికసు♦ఖాళి స్వాశ్రి
తాంబరంబున కతివికా♦సంబు నొసఁగు
హరితొడలు వైశ్యజనకంబు ♦ లగుట యొప్పొ. ౨౬౩

తే. గీ. వరసువర్ణవర్ణాంబర♦భాసి రుక్మి
ణీముకుందకటిద్వయ ♦ మోము మమ్మ
భంగసాంద్రసంధ్యాఘన♦సంగతశిఖ
రోల్లసద్ధేమనీలగి♦ర్యుపమితంబు. ౨౬౪

తే. గీ. అమలపీతాంబరాంచిత ♦ మగ్ర్యరత్న
ఖచితరాజితకింకిణీ♦కాంచికాది
జాతకాంచియు నై యొప్పు♦శౌరిపీన
సన్నితంబ మెన్నుము మాన♦సను నిరతము. ౨౬౫

తే. గీ. రమ్యమేఖలాశ్రితరత్న♦రాజికాంతి
తరళకాంతిభారంబునఁ ♦ దగి వినమ్ర
మయ్యెనో యనఁ దగి రమా♦బ్జాక్షినీవి
కాంతు లాపాదపద్మంబు ♦ గా వెలుంగు. ౨౬౬

చ. వ్రజభువి నెన్నిరజ్జులకు ♦ బద్ధము కానిజనార్దనోదరం
బు జలరుహాక్షి రుక్మిణి స♦ముత్ప్రసరత్పులకాళిశోభి యగా

నిజభుజసన్మృణాళమున ♦ నేర్పునఁ గట్టఁగఁ జాలెఁ జిక్కఁడే
యజితుఁడ యయ్యెఁ బ్రేమ మను ♦ ప్రాంచదుదారసుదామపాళికిన్.

క. హారివళి రాజిల్లెఁ ద్రిధో
దరగతమై యంకగతసు ♦ ధాకంధిసుతా
స్ఫురితకరోచ్చాంగుళికాం
తి రహిం జెలఁగెడు ననంగ ♦ నిఖిలస్తుతమై. ౨౬౮

క. హారిసూక్ష్మరోమలత త
ద్వరనాభిం జొచ్చి వెడలి ♦ పైఁ బ్రాఁకెడుసం
స్ఫురదబ్జజాకటాక్షో
త్కరరాజిం బోలి వెలిఁగెఁ ♦ గడుఁ జిత్రముగాన్. ౨౬౯

తే. గీ. మహిమ స్వర్ణవర్ణోదర ♦ మధ్యలగ్న
శ్రీమనోజ్ఞరోమావళి ♦ చెలఁగె నరయ
సతులకుచకుంభికుంభయు ♦ గావతీర్ణ
మైనమదవారిధారయో ♦ యనఁగ నొప్పి. ౨౭౦

మ. తనురోమావళిసీలరత్నలత కాం ♦ తానాభివాపీతటిన్
దనరం బుట్టి లసత్కుచాచలతటీ ♦ ద్వంద్వాంతరం బొందఁ బో
వ నభోవ్యాప్తి నలబ్ధమధ్యసరణిన్ ♦ బ్రహ్మర్పితస్నిగ్ధకాం
చనసద్యష్టియొ నాఁగఁ దద్వళి సమం ♦ చత్ప్రౌఢిమం బొల్చెడున్.

తే. గీ. తగ సముద్దీప్తహారమ ♦ ధ్యగతరత్న
నవ్యకాంతిహృద్యము మనో ♦ జ్ఞలసదుదర
బంధబద్ధంబు చంచత్త్రి ♦ వళియుతంబు
వారలకృశోదరంబు శు ♦ భప్రదంబు. ౨౭౨

మధ్యాక్కర. తనర గర్భస్థితవిశ్వ ♦ తతు లయ్యెఁ బ్రద్యుమ్నముఖ్య
జనకు లిప్పుడు భీష్మసుతయు ♦ శౌరియు ననుచు సూచించు

ననువున విశ్వమందిరము ♦ నయ్యె మన్మథగాత్రమాత్ర
మును ధరించినవారిమధ్య♦ము ముదంబు నిచ్చుత మాకు. ౨౨౩

మధ్యాక్కర. కనఁగ సత్తర్కమాత్రిక♦కలితంబు సకలాపవర్గ
మునునయి హరినాభివివర♦మున నుండి పుట్టినగగన
మున కూర్ధ్వభాగంబునందుఁ ♦ బొనరి పద్మోపభోగ్యమగు
ఘనపరిణామం బనంగఁ ♦ గాంచెఁ దన్మధ్యంబు ఖ్యాతి. ౨౨౪

చ. వనధిసుతాముకుందతను♦వర్తులమధ్యము శిక్షితాత్ము ల
య్యును గవు లెల్ల రెడ్డుఁ గల ♦ దో మఱి లేదొ యటంచు సందియం
బునన గణించుచుండుదురు ♦ బుద్ధిఁ జుమీ యది కారణంబుగా
జనములు సందియం బనఁగ ♦ సంజ్ఞితమై తనరారు మధ్యముల్.

తే. గీ. విభునిమృదులమనోజ్ఞసు♦వృత్తమధ్య
భూమి యొప్పెడు లక్ష్మి య♦తూష్ణిద్వివిధము
మదిని భావించి హస్తప♦ద్మమున సంత
తంబు నాశ్లేషశీలయై ♦ తనరు చుండు. ౨౨౬

తే. గీ. అఖిలవర్ణ్యలావణ్యగు♦ణైకధామ
మంబుజాక్షునురంబు చి♦రంబు మిగుల
నల సపత్నిచయకుచల♦బ్ధాంక మయ్యె
దాని విడువక లక్ష్మి స♦దా వసించు. ౨౨౭

చ. తతపరిరబ్ధభీష్మకసుతా♦కుచకుంకుమలక్ష్మలక్ష్య మా
దితిసుతనైరివక్షము స్వ♦తేజము చేత జయింపఁ గల్గె సం
తతసమదస్ఫురత్సరిణ♦తద్విపధాతుసురక్తకుంభల
క్ష్మతతియు తేంద్రనీలనగ♦చారువిశాలతటంబు నెంతయున్. ౨౨౮

తే. గీ. కౌస్తుభోద్భాసితంబు ౙ్రీ♦కామినీగృ
హంబు చందనచర్చితం ♦ బతివిశాల

మింద్రనీలనీలంబు వి♦స్తృతవిభూష
ణాళి విశ్వలువక్షంబు ♦ నమరఁ దలఁతు. ౨౭౯

మ. పురుషోత్తంసునురోనులేపమణియై ♦ పొల్పొందు గంధంబునం
గరమున్ శోభితమై చెలంగు కమలా♦కాంతాకుచద్వంద్వ మా
దరసౌవర్ణసురమ్యపూర్ణకలశ♦ద్వంద్వోపమానంబు నుం
దర ముత్కృష్టతఁ జెందుఁ గావుతను హృ♦ద్యం బద్భుతప్రౌఢిమన్.

తే. గీ. లలి సమాచ్ఛాదితస్వమా♦లప్రదేశ
మారమాస్తనయుగమున ♦ కఖిలధర్మ
గోప్త యాశౌరి కర మిచ్చెఁ ♦ గూర్మినట్టి
స్తనయుగంబును వర్ణింప ♦ శక్తుఁ డెవఁడు. ౨౮౧

తే. గీ. శుద్ధమందస్మితామృత♦శోభిబింబుఁ
బూర్ణ నమలమనోజ్ఞాస్య♦పూర్ణచంద్రుఁ
జూచి ధరియించె యువతి వ♦క్షోజయుగము
సతతముకుళితపద్మకో♦శములకాంతి. ౨౮౨

చ. సమము సువంశజాతమును ♦ సద్గుణశోభి సువృత్తరత్నమై
యమరియు నవ్యమౌక్తికసు♦హారము పీనకుచాకుచంబులం
దమరఁగఁ బొంద నేర దిసు♦మంత మెడంబును వృత్తశీలవం
శము లవి తేజరిల్ల విట ♦ మాన్యగతిం గఠినాంతికంబునన్. ౨౮౩

మ. అని శార్ఙ్గగ్రహణంబునందును గుణా♦కాకృష్టి నారాచధా
రణసంధానములందు మాధవచతు♦ర్హస్తాబ్జముల్ పొల్చి కా
ముని కేళిన్ గమలాకచగ్రహమునన్ ♦ బొల్పొపరీరంభమం
దును గండగ్రహణాధరక్షతముల్ ♦ తోఁచుం బ్రవీణంబులై.

చ. తలఁపఁగఁ బ్రస్ఫురన్మరక♦తద్యుతులన్ నఖరమ్యమౌక్తికం
బులు నతిదీర్ఘముల్ విభుని♦పూజితహస్తము లెన్న నాలుగున్

ఫలితసుపుష్పితాగణిత♦వైభవశోభితపారిజాతశా
ఖలగతి నొప్పుచుండు నత♦కామితసత్పురుషార్థదంబులై. ౧౮౫

తే. గీ. శౌరిచక్రము హతదైత్య♦చక్ర మతని
శంఖము స్వనధిక్కృతశత్రు♦శంఖ మతని
పద్మ మది ధ్వస్తపరముఖ♦పద్మ మింక
నతనిగద యది పాపగ♦దాపహంబు. ౧౮౬

తే. గీ. శత్రుల కసహ్య మయ్యె ని♦జప్రహర్ష
దం బగుటఁ జెల్లెఁ దదసి నం♦దక మనంగ
విరహిణీతాపదుం డయ్యె ♦ విశ్వమునకుఁ
జంద్రుఁ డానందకరుఁ డౌట ♦ నందియంబె. ౧౮౭

తే. గీ. శరములనపారముల శత్రు♦సంఘదైన్య
కారి యయ్యును ద్రిసతంబు ♦ శౌరిచాప
మల్లె సద్వంశభవులు గుణాఢ్యు లరయ
నన్ని వేళల నతులు స♦మర్థు లయ్యె. ౧౮౮

చ. ఘనవలయాంగుళీయమణి♦కంకణదీప్తుల వెల్గుచుఁ సుద
ర్శనసుగదాబ్జశంఖముల ♦ రాజిలి వర్తులమై త్రిరేఖశో
భనమణిబంధకాంతివిభ♦వంబున శోభిలి శోణపద్మభం
జనతలరంజితం బయిన♦శౌరికరాఘము మమ్ముఁ బ్రోచుతన్.

తే. గీ. అరయఁ బూర్ణమనోరథుఁ ♦ డయ్యె వేని
బంధమును గోరి మఱచు స♦ర్వంబు నట్టి
కంధిజాక్వణత్కటకకం♦కణముఖవర
భూషణాంచితకరములు ♦ ప్రోచు మమ్ము. ౧౯౦

తే. గీ. వృత్తములు త్రిరేఖంబులు ♦ వివిధరత్న
దీప్తములు నగు శ్రీశ♦దివ్యకంఠ

రములు గెల్చు విష్వక్సేనివ♦ద్రత్నచిత్ర
ము లగుశంఖశేవధులను ♦ బొనర మహిమ. ౨౯౧

తే. గీ. రత్నలసితపరిస్రితర♦మ్యచిత్ర
భూషణవికాసితము వృత్త♦మును ద్విరేఖ
మును విమలహారజుష్టంబు ♦ వనధిజేశ
కంఠ మది స్మరణీయంబు ♦ కడఁక నెపుడు. ౨౯౨

మ. సరసేందీవరమల్లికాప్రవిలస♦జ్జాతిస్ఫురచ్చంపకా
భ్యరుణాశోకమృదుప్రసూనరచితం ♦ బబ్జాగ్ర హాకృష్ణవా
ల రహిన్ దద్గళగన్న హాకనకనీ♦లస్ఫారముక్తాబ్జరా
గరుచిప్రోజ్జ్వలదబ్ధిజాకరలతం ♦ గా నెన్న నౌ నారయన్. ౨౯౩

తే. గీ. బంధవిరహిత యయ్యును ♦ సింధుసుతకు
నతులమాంగళ్యసూత్ర మొ♦ప్పారె నిత్య
బద్ధమై ముగ్ధకామినీ♦భవ్యకంఠ
యోగ మది గల్గ మోహమే ♦ నొల్లరు కద. ౨౯౪

ఉ. మంగళదేవతాబ్జదల♦మానితనేత్ర ధరించినట్టి స
న్మంగళసూత్ర మద్భుతస♦మంచితనీలమణిప్రశోభి త
న్మంగళకంఠమున్ విడిచి ♦ మానుగఁ బాయఁగ లేదు మున్ను త
త్సంగతిఁ బాయ నేరదిఁకఁ ♦ దద్దయు నిప్పుడు పాయ దెన్నఁగాన్.

చ. నిజహరిణంబు దూరమున ♦ నిల్పి తదీయవిలోచనంబులన్
నిజసితబింబమందుఁ గడు ♦ నేర్పునఁ జంద్రుఁడు నిల్పుఁ గాక యా
విజయిశుచిస్మితాఢ్యము సు♦వృత్తము లోలవరాలకంబు నం
బుజనిలయాస్యమున్ లలిత♦మోహననేత్రముఁ బోల నేర్చునే.

తే. గీ. గణ్యమాణిక్యశోభి ము♦ఖము సదాంత
రనికషోపలాగమభాసి ♦ రమ్యహాక్తి

కంబు మానార్హనీలాక్షి ♦ కంబు నగుక
రండమును గెల్చు శ్రీనాథు ♦ గండయుగము. ౨౯౭

మధ్యాక్కర. అమలచంద్రోపమితంబు ♦ నఖిలసౌఖ్యచయప్రదంబు
విమలసౌందర్యదుగ్ధాబ్ధి ♦ ఫేనకల్పం బోష్ఠకాంతి
రమణీయతర మగునింది ♦ రానాథుమందస్మితంబు
రమణ మాయఘపాళి నడంచి ♦ రక్షించుఁ గావుత మెపుడు.

చ. అమలము కోమలాచ్ఛదర ♦ హాసదశాకలితైకదేశ ము
త్తమకమలాకపోలలలి ♦ తక్షతకారణభూత మచ్ఛరూ
పము వరకుందకుట్మలని ♦ భంబు గదున్ నిబిడంబు యాదవో
త్తమురదనాళి నాదుమది ♦ ధ్యానము సేయుదు సర్వకాలమున్.

తే. గీ. మహితసన్మాన్యలావణ్య ♦ మధునిబిడము
సలలితామ్లానచంపక ♦ సంపదంచి
తంబు లసదున్నతాగ్రంబు ♦ దైత్యరిపుని
సరసనాసాపుటము మాన ♦ సమునఁ దలఁతు. 300

మధ్యాక్కర. నుతము వ్యక్తాతికోమలమ ♦ నోహరవర్ణపూర్ణంబు
శ్రుతిచయార్థసువృత్తి మధుర ♦ శోభనస్వర మత్యగాధ
మతులితక్లేశదుర్విషశ ♦ మామృతవర్షకల్పంబు
శ్రితు నన్ను నిజతత్త్వ మెఱుఁగఁ ♦ జేయుత హరివాగ్విభవము.

మధ్యాక్కర. నానావిధానుపమమణి ♦ నానావిధవిచిత్రలసిత
మీనోపమోజ్జ్వలకనక ♦ మిహిరాభకుండలయుతము
శ్రీనాథుకర్ణయుగళము ♦ శ్రీసుభగము వినుఁ గాత
దీనభవార్తమత్స్తుతు లు ♦ దీర్ణత సతతంబుఁ బ్రీతి. 30౨

శా. అంభోజాతవిశాలకోమలసుదీ ♦ ర్ఘాంచత్సుపత్త్రిప్రభా
సంభావ్యంబును సంచలన్మధుకరీ ♦ జాతోల్లసత్తారమున్

శంభుస్వఃపతిముఖ్యవాంఛితకటా♦క్షశ్రీవిలాసంబు ను
జ్జృంభిశ్రీధరనేత్రయుగ్మము నిరీ♦క్షించున్ ననుం బ్రీతిమై. 303

చ. వరకుటిలాలకంబు మణి♦వర్గమయోజ్జ్వలపట్టబంధమున్
దరలసితాలికద్వయము ♦ తద్గ కురంగమదాత్తపుండ్రభా
సురము విశాల మౌదితిజ♦సూదనుదివ్యలలాట ముల్లస
త్కరుణ మదీయఫాలలిఖి♦తం బొనరించు శుభప్రదంబు గాన్.

తే. గీ. శ్యామము త్రివక్రము విధిము♦ఖ్యామరేశ
రాజిసామ్రాజ్యదానకా♦రణసులీల
మంగజాగ్ర్యచాపాకృతి ♦ యంగజాత
జనకుభ్రూమండలము ప్రోచు ♦ సరవి మమ్ము. 304

ఉ. ఏయధరంబునుండి జని♦యించురసంబున లుబ్ధచిత్తయై
శ్రీయువతీలలామ యదు♦సింహునివక్షమునన్ వసించు నె
స్డేయధరంబు వేణువున ♦ నేర్పడ నుండెడు నట్టియాప్రవా
ళాయతకాంతిహృద్యదువ♦రామలమృద్వధరంబు వో ల్చెడున్.

చ. అమరఁగ దేనియుం దుదిత ♦ మానమ్మృతంపుఁగణంబునన్ ఫణీం
ద్రమృదులశయ్య నిత్య మజ♦రామరణుం డగుచున్ సుఖించు శ్రీ
రమణుఁడు పక్వబింబసమ♦రమ్యతమం బగునట్టిసాత్త్వతో
త్తమదయితాధరోష్ఠము స♦దా ననుఁ జేయుత సంపదన్వితున్.

చ. సరసుఁడు దేనిచుంబనము ♦ సల్పుటఁ గృష్ణుఁడు నిత్యతృప్తుఁడై
పరఁగు గతాన్యతృష్ణుఁ డయి ♦ భాసురకుండలరంజితంబు స్వ
ర్ణరచితరమ్యసత్ఫలక♦రాజనిభం బగునట్టియారమా
తరుణికపోల మర్మిలి స♦దా ననుఁ జేయుత సంపదన్వితున్. 306

తే. గీ. అతులవశ్యార్హరక్తర♦సాతురంబు
ప్రియవశీకరణోచిత ♦ మయినకనక

యంత్రవరమును బోలెడు♦నట్టిదశన
పదయుతరమాకపోలంబు ♦ ప్రభల మించు. 308

తరువోజ. అంతర్నిగూఢహే♦మాంకురితాన
నాంచితం బయ్యె ము♦రాసురవైరి
కాంతామణీనాసి♦కాభూషణమణి
కనఁగ ముక్తామయ♦ఖ్యాతి వహించె
వింత గాదే యది ♦ ప్రియవధూభవ్య
విశదపీయూషార్ద్ర♦విమలోష్ఠబింబ
సంతతచుంబన♦సద్భాగ్యులకును
జగతి నెందామయ♦సంగతి గలదె. 309

మధ్యాక్కర. అమలముక్తాత్మక మయ్యె ♦ నతివనాసాభూషణమణి
సమ్మదుతాకాబ్జిజోష్ఠాను♦ష క్తయై తదపాంగబాణ
సమితిభిన్నం బయ్యె విడిచి ♦ చన లేక పరిలంబి యయ్యెఁ
దమి నింక హరి వశ్యుఁ డగుట ♦ తగ నసాధ్యంబె తలంప. 310

తే. గీ. వినుతనాసాఖ్యచంపక♦భీతిచలిత
మీనకాంబుజాతార్పిత♦మ్యౌత్సముత్సు
కం బధీరజవంబు భృం♦గతతిసంప
దను యదుపరాజ్ఞ్యపాంగంబు ♦ తద్ద గెలుచు. 312

మ. హరి హేమాంగిని నీలరత్నసదృశా♦పాంగిఁ బ్రవాలోల్లస
చ్చరణం సుస్మితమౌక్తికం మరకత♦స్కంధాభవేణ్యాశ్య సుం
దరి వైడూర్యనఖం నఖక్షతలస♦న్మాణిక్యపుష్పం వరా
ధరగోమేద రదోచ్చవజ్రఁ దగఁ జెం♦దం జేయఁ డాస్వర్ద్రి వుం.

చ. కలికిమనోజ్ఞకాయమునఁ ♦ గార్శ్యము లంబితదైర్ఘ్య మెన్నఁ గుం
తలములఁ జేతులం మఱి క♦నం గనులందును మధ్యమందు నూ

రుల నతిచంచలత్వము ని♦రూఢి నదృశ్యత మార్దవంబునుం
* గల విభకుంభరుగ్విజయి♦కంధిసుతాకుచసీమ లేని వౌ. ౩౧౪

తే. గీ. లలి రమాహరిభ్రూమధ్య♦లగ్నమృగమ
దీయతిలక మొప్పారె న♦ది నికషోప
లోపరిగతంబుఁ గందర్ప♦చాపలగ్న
మయినయసితోత్పలాస్త్రంబు ♦ ననుకరించి. ౩౧౫

తే. గీ. నిరతమును బరస్వరమనో♦హరశరీర
సంగమున మత్తషట్పదా♦భంగకాంతి
నెంతయును ఫుల్లపంకజ♦కాంతి లసిత
ములు రమాశౌర్యపాంగముల్ ♦ బ్రోచు మమ్ము. ౩౧౬

చ. విమలకిరీటభానుఁ గని ♦ భీతి నధోముఖలంబమానమై
యమలముఖేందునిం గని భ♦యంపడి యున్ముఖమై యరాతిమ
ధ్యమున భ్రమించుయోధుగతిఁ ♦ దల్లడమందుతమంబు నాఁగఁ ద
ద్భ్రమదలకాళి కర్ణయుగ♦భాగసితోత్పలకాంతి దాఁగెడున్. ౩౧౭

ఉ. శ్రీకలితంబు నీలచమ♦రీమృగవాలభరాభమున్ స్ఫుర
చ్ఛ్రీకరరత్నసన్ముకుట♦సేవితమున్ మఱి యుల్లసత్సమా
ఘూకర ముజ్జ్వలంబు నగు♦నాకమలాచ్యుతమౌళిదేశమున్
జోక నుతింతు సంతతము సుస్థిర♦భద్రము కోరి భక్తితోన్. ౩౧౮

వ. ఏతాదృశానన్యసామాన్యాగణ్యలావణ్యప్రావీణ్యాంచచ్ఛరీరు లగు
నక్కారణశరీరు లమందానందంబుల సౌఖ్యవార్ధి నోలలాడు నెడ.

( వసంతర్తు వర్ణనము. )

పంచచామరము. అనన్యయోగ్యశౌరిభోగ ♦ రూఢిఁ గృష్ణునానతిన్
వినోదకేళి మూలలక్ష్మి ♦ వేగ మూలమాధవం

---

* ఇది విషమసమస్యాపూరణము.

బునఁ బనీరమాత్మగత్వ◆ముఁ బహించె మాధవం
బునఁ రమేశుప్రీతిక్షే స◆ముత్సుకత్వ మేర్పడఁ. 3౨౦

తే. గీ. మాధవాగమమున మూల◆మాధవగత
మైననిజమూలవరలక్ష్మీ ◆ నంతఁ దనదు
బుద్ధిఁ దెలిసి క్రీడామాధ◆వుం డచటికి
నరిగె వేడ్కఁ గ్రీడాలక్ష్మి ◆ యనుగమింప. 3౨౧

తే. గీ. అనిలమర్దితఘర్మబిం◆దువ్రాంగుఁ డగుచు
హేమచార్వంబకుం డంబు◆జేక్షణుఁడు ప్ర
సూనమృద్వంఘ్రితలుఁడు శ్రీ◆శుండు గనియె
లలిని రమణీయమాధవ◆లక్ష్మిఁ జెంత. 3౨౨

సీ. వరబర్హిబర్హాక్షిఁ ◆ బ్రసవాననాంచిత
నలికులోత్ఫుల్లాల◆కాళిలసిత
సత్పల్లవప్రాంత◆శాఖాభుజను మఱి
లతికామృదులగాత్రి ◆ లలితశోభ
రక్తవర్ణాంబరా◆రంజిత మాద్యత్పి
కాఘుసుస్వనను శు◆కౌఘువాక్య
చాటువు వరపలా◆శప్రసూనాధర
బుతుమతి గ వనదే◆వత నెఱింగి
ప్రణయకోపలజ్జాభర◆వతియయి పతి
మోముఁ గనురుక్మిణిని దేవ్చి ◆ ముద్దుగొనియె
నీతలం పిది యుత్ప్రేక్ష◆ణీయమ కద
యీవె కావె తద్రూపంబ ◆ వింతి యనుచు. 3౨3

తే. గీ. కుసుమసంచయకంపన◆గురుమనోజ్ఞ
సజలశీకరదక్షిణ◆సలలిత ని

లవ్యజనపాణిమై వేడ్క ♦ లలి వనరమ
మనుజమానసమండను ♦ ననుగమించె. 3౨౪

తే. గీ. సకలదర్పకదర్పకా♦స్త్రాయితంబు
లగులసత్సహకారన♦వాంకురముల
స్మరరహస్యమంత్రోత్కర♦జపముల నన
మందరుతములఁ గోకిల♦బృంద మొప్పె. 3౨౫

తే. గీ. మాన మిత్తఱి తగ దిఁక ♦ మానుఁ డనుచు
నబ్జవదనాధరామృతం ♦ బానుఁ డనుచుఁ
గాంతలకుఁ గాంతులకుఁ దెల్పు♦కరణి నొప్పెఁ
గుసుమచుంబనకృద్భృంగ♦కులరుతములు. 3౨౬

తే. గీ. పథికయువతి మరుత్స్పర్శ♦పథమున విర
హార్తి నలికులాలికులాళి ♦ యనిలుఁ గూడి
యరిగి పతిప్రోలఁ దనయార్తి ♦ నమరఁ దెలుపుఁ
గాక యను చశ్రువులఁ జల్లె ♦ గాలిత్రోవ. 3౨౭

తే. గీ. మధునియుక్తభుజంగాళి ♦ మదనరుచిర
మైనయోషిత్స్తనమున న♦పీనశివుని
వ్రాసె నన నప్డు నఖపద♦రాజకళను
మఱియు వసనచ్యుతిని మృగ♦మదముచేత. 3౨౮

తే. గీ. అసితకంఠతఁ గరయుగ♦ళాంబుజాత
వేష్టితసుమూర్ధతను హృన్ని♦వేశనంబు
నమర సముదృశ్యతను జిర♦తాంతవదన
ములను రుచిరత రచియించె ♦ మొగిని వేడ్క. 3౨౯

ఆ. వె. మదనవహ్నిసఖుని ♦ మఱి ప్రియశీతలు
సహహ కుసుమగంధ♦సహు ననిలునిఁ
దద్ద గొలిచిరి సుర♦తప్లానముఖు లుప
రతమనోజరణులు ♦ రహి జనములు. 330

తే. గీ. చిత్రమె వసంతవేళలఁ ♦ జిగురుఁబోండ్ల
కౌఁగిలింతలఁ గోరుట ♦ కడఁక నరులు
తరువులును సరాగంబులై ♦ తద్గ వాయు
చలితతనులతాపరిరంభ♦ముల వెలయఁగ. 331

తే. గీ. తనరా జింక జనించు పీరి కని చెం♦తన్ వారిఁ బూజించి పా
వనదాక్షిణ్యముఁ గోకిలాళిమధుర♦త్వంబుం బ్రవాలాలినూ
తనరాగంబు శుకప్రియోక్తు లలిగీ♦తంబుల్ మధుస్నాన మ
ర్చనమున్ సత్సుమరాజి ఛత్త్రము తరు♦చ్ఛాయన్ వసంతుం డిడెన్.

వ. ఇవ్విధంబున సమ్మాధవుండు సుధాపాథోధిసుతాసమేతుం డయి యమ్మాధవవేళం గ్రీడించుచుండ నంతఁ గతిపయదినంబులకు. 333

(గ్రీష్మర్తు వర్ణనము.)

తే. గీ. మహితనిజబలకరదీప్తి ♦ మఱుఁగుసఱుచు
మూలమాధవమాధవ♦శ్రీల నడఁప
నెఱిఁ గడిమిఁ బొల్చె గ్రీష్ముండు ♦ నిజహితార్థ
మొనరఁ మాధవుఁ డయ్యుప♦వనము సేరె. 334

చ. అల వనమాధవుండు తప♦నాధికకాంతి జయింప గ్రీష్ముఁ డ
ప్డలుక వసంతపుష్పనివ♦హంబును శుష్కముఁగా సమీరునిన్
లలి నతితప్తుఁగా నలికు♦లంబును జంపకకంపితంబుఁ గాఁ
జెలఁగి పికాదిపక్షితతి ♦ క్షిప్రము మూకను గాఁగఁ జేసె హా.

మధ్యాక్కర. అరయంగ శీతలోదకము ♦ నల యనుష్ణాశీతధరణిఁ
గరము భానుకరోష్ణితములఁ ♦ గావించి గాలి నూర్ధ్వగతిఁ
దిరుగఁ జేసి త్రివృత మయ్యు ♦ దేహ మమ్మాత్రపాత్రముగ
సరగఁ జేసి దవాగ్నిఁ బెంచి ♦ జలము నింకించె గ్రీష్ముండు. ౩౩౬

తే. గీ. అల నిదాఘభయంబున ♦ ననఁగ శివుఁడు
గంగఁ దాల్చె రమాపతి ♦ కంధిఁ జేరె
నరయఁ బంకజవిష్టరుం ♦ డయ్యె నలువ
యహహ పరు లోర్తురే ని ♦ దాఘాతపంబు. ౩౩౭

తే. గీ. అప్పుడును సిద్ధు లలఘుపం ♦ చాగ్నిమధ్య
మునఁ బ్రహృష్టరోమాళులై ♦ కనులు మూసి
కొనుచు ధ్యానింతురు ఫలము ♦ కోరువారి
కరయఁ గలదె యసహ్య మెం ♦ దైన నహహ. ౩౩౮

తే. గీ. గాలి కృష్ణపదాబ్జయు ♦ గ్మంబు నిచటఁ
దాఁకుచు సుశీతలుం డగు ♦ దాపవహ్ని
నుజ్జ్వలంబుఁ గా నచ్చట ♦ నొనర లేపుఁ
జపలులస్వభావ మిది కాదె ♦ సరవి నెందు. ౩౩౯

తే. గీ. నాగరులు గిరికుంజగ ♦ ణంబుఁ జేరి
తగఁ బ్రియాపయోధరకుంభ ♦ తటిని గాఁగి
లించి తదధరామృతము సే ♦ వించి తాప
మును బిపాసయు నార్తురు ♦ ముదము మీఱ. ౩౪౦

తే. గీ. తనర శ్రీకృష్ణముఖచంద్ర ♦ దర్శనమున
నెలమిఁ దద్దృష్టిపీయూష ♦ వృష్టివలనఁ
దపనుతాపంబు నెఱుఁగక ♦ ద్వారవతిని
జనులు సుఖయించు చుండిరి ♦ సౌఖ్యవృద్ధి. ౩౪౧

( వర్షర్తు వర్ణనము. )

వ. ఇవ్విధమునం దపనగ్రీష్మములు విజృంభించి యుండు నంత. ౩౮౨

తే. గీ. జలదగణము సవర్ణుఁ డౌ • జలజనయను
నకు సహాయార్థ మేతెంచె • నా సమీప
గం బయి నిజాంగముల భానుఁ • గప్పి గ్రీష్మ
జలములను గప్పి పోషించె • జగము నెల్ల. ౩౮౩

తరువోజ. ధర నెన్న విష్ణుప • దం బాశ్రయించి
తగ నర్థులకు వారి • ధారలు గురియు
నరళుఁ డౌఘనునకు • జడనాయకుఁడును
సారథ్య మొనరించుఁ • జాలఁగా నెపుడు
నిరతంబును ముకుంద • నిర్మలచరణ
నీరజార్పితసర్వ • నిజవిభవునకుఁ
బరికింప నుపకార • పరునకు నెందుఁ
బరఁగ సాహాయ్య మె • వ్వఁడు సేయఁ డొక్కొ. ౩౮౪

ఉ. భావన సేయ శోకహర • వారి జగంబుల కెల్ల నిచ్చు మే
ఘావళికిం గడున్ విమతుఁ • డయ్యును దక్షనయోగకారిగాఁ
జూపె సమీరుఁ డొప్పెఁ దగఁ • జోకఁ బరోపకృతిప్రలగ్నస
ద్భావుల కెందు శత్రులు ను • దారశుభావహు లౌట చిత్రమే.

మ. పరవిద్యుత్తతి వక్రశక్రధను వో • ప్పన్ ఖాశ్రయంబై పయో
ధర ముద్గర్జల వర్షముం గురియ భ్రాం • తస్వాంతులై భీతిఁ జెం
దరు లోలాక్షికటాక్షముల్ బొమయు స • న్నద్ధోర్ధ్వ గాంచత్పయో
ధరముల్ నెండి క్వణత్సుభూషణతతిన్ • దా రొందుటన్ మాన
వుల్. ౩౮౬

చ. జలకణమాత్ర మంబుధి యొ♦సంగ సరిత్తతికిం బయోధికిం
జలముల వృద్ధిగా ఘనుఁ డొ♦సంగెను విష్ణుపదాశ్రయుండు నె
ప్డిల నుపకారి యౌనరున♦ కింత యొసంగినఁ గోటిగుణ్యమై
వలనుగ దాతఁ జేయదె స్వ♦వర్గముతోఁ దగ వృద్ధి గాంచఁగన్.

తే. గీ. గ్రీష్మసత్త్వ మసహ్యమై ♦ రేఁగియు వడి
నంబుదాగమహృత మయ్యె ♦ నదియు యుక్త
మమర సర్వంసహాజీవ♦నము హరించు
వానితేజంబు నిరతంబు ♦ ఏఱలఁ గను నె. ౩౮౪

( శరదృతు వర్ణనము. )

సీ. అలసాధుజనమాన♦సాకృతి సరసులఁ
దగఁ బరిశోధించి ♦ తద్వదనని
భాంబుజచయముఁ బ్ర♦హర్షంబు నొందించి
మించి పంకంబు ఖం♦డించి మఱియుఁ
దద్ధవృన్నభోగతిఁ ♦ దనరునభంబు ఘ
నాపిధానరహిత ♦ మగుటఁ జేసి
యలఘుతమ మడంచి ♦ హరివీర్యకీర్త్యాభ
సూర్యోడుపులకాంతి ♦ స్ఫుటము సేసి
యతులసంసారబంధంబు ♦ ననఁగ భిక్షు
వణిజులకును బ్రావృట్కాల♦బంధనమును
సరగఁ ద్రెంచి మోక్షానంద♦సత్ప్రవాహ
తులితగోక్షీరవరపాన♦ముల జనముల. ౩౮౫

తే. గీ. ముదితులుగఁ జేసి సచ్ఛాత్ర♦మునకు నుద్ది
యై సముజ్జృంభితం బగు ♦ చమరెఁ జూడ

నతులవరశరత్సామ్రాజ్య ♦ మంత ధరణిఁ
గరము సకలజనానంద ♦ సరణి నొప్పి. 3౫౦

సీ. గణితపద్మాసేవ్య ♦ గుణరాశివిస్తృతి
కారి సృష్టికృత ♦ శారదైక
ఘనసదానందుండు ♦ కంపితభోగిరా
ణ్మూర్ధసన్మాన్యాగ ♦ ముండు మఱియు
సన్మార్గసంశ్రితాం ♦ చత్పంకశోషణ
కరుఁడును సత్పాంథ ♦ ఘర్మహరుఁడు
నౌనర విష్ణుపదాశ్రి ♦ యుండును బరిలస
త్పుణ్యాంబుపూతుం డ ♦ గణ్యసుఖదుఁ
డనవరతము రామాయోగి ♦ జనుల కరయ
భీమచరితుండు సద్వంశ ♦ వితతి నెపుడు
స్వాగిమమునఁ క్షేమాలంబ ♦ నైకశబ్ద
హృద్యవదనంబుగాఁ జేయు ♦ నిద్ధకీర్తి. 3౫౧

తే. గీ. సుమనసాళికి సుక్షేమ ♦ మమరఁ గూర్చు
పుణ్యుఁ డీక్షితి సువ్యక్త ♦ మూర్తి మాఱు
తుండు సచ్ఛాస్త్రమందు స ♦ ద్గురుని బోలి
సేవ్యుఁ డవ్వేళ మూర్ధాభి ♦ షిక్తుఁ డయ్యె. 3౫౨

( హేమంతర్తు వర్ణనము. )

తే. గీ. పతివియుక్తనారీముఖ ♦ పద్మములను
బద్మతతితోడ శిథిలమై ♦ పరఁగఁ జేసి
యుల్లప్రబోధకల్పకు రవి ♦ నల్పకాంతి
యుతుఁగఁ జేయుచు హేమంత ♦ మొప్పె నంత. 3౫3

తే. గీ. ఇనుఁడు నుష్ణకరుం డయ్యె ♦ హిమచయార్ద్రి
తాంగుఁ డౌచును స్వకరంబు ♦ లగ్నిఁ జేర్చి
జలధిఁ దఱుచుగఁ జొచ్చెడుఁ ♦ దలఁప నింక
నబల లెట్లోర్తురు హిమంబు ♦ నట్టివేళ. ౩౯౮

సీ. మాధవంబున మూల♦మాధవంబున వేడ్క
మాధవవనమాస♦మానసరణిఁ
దగ నిదాఘమున స♦దాస్వాద్యధరసుధా
స్వాదనలీలావి♦నోదములను
వర్షాగమమున స♦వర్ణతామ్రోత్తి ఘ
నామర్షరహితత ♦ ననఁగ నెలమి
నల శరత్తున మరు♦దాసీతసౌరభాం
చితసర్వతీర్థాళి♦ సేచనముల
నలఘుహేమంతశిశిరవే♦ళలఁ గరంబు
నిత్యనిర్భరపరిరంభ♦నిరతిఁ దనరి
రుక్మిణీకృష్ణు లిల నని♦రుద్ధగతుల
నంచితవిభూతిశోడ ర♦మించి రంత. ౩౯౯

( ప్రద్యుమ్నకుమారజనన వర్ణనము. )

సీ. మారుఁ గుమారునిం ♦ బడయ నుమాపతి
మర్త్యానుశిక్షణ♦మాన్యశీలుఁ
డయిన కృష్ణుఁడు సేరి ♦ ప్రార్థించి వరమును
బడసి రా నంతలోఁ ♦ బడఁతి భైష్మి
మహితసంతోషాబ్ధి♦మగ్నమూర్తి యగుచు
మోదాశ్రుధారల ♦ మొగిని భర్త్స

చరణముల్ కడిగియు ♦ వరకాయకనకంబు
కృష్ణార్పితము సేసి ♦ కృష్ణగాత్ర
వరహారిన్మణి నిజకర♦వశము సేసి
కొని ధరించెను స్మరు గర్భ♦మునను వేడ్క
నతివ యవిముక్తకబరి యా♦నబ్జ యట్టి
కాంత యేయర్థితము లొందఁ ♦ గాంచ దొక్కొ. 3౫౬.

చ. అల గజరాజరమ్యగతి ♦ యబ్ధికుమారిక తన్వి కాంతు సే
వల మదనాత్మకంబును శు♦భస్థితిఁ దాలిచె గర్భమందు ని
స్తులితనరానుకారిచరి♦తుం డగు కాంతువియుక్తి భీతయై
కలఁగుమనంబునందును ద♦గం ధరియించెను వెండి దానినే.

తే. గీ. మారుని గుమారుఁ గనియెను ♦ శౌరి కల జి
తారి కనురూపరూపుఁ దా ♦ నంత భైష్మి
యొనరఁ బ్రాచీనకవివిష♦యుని నిశేశుఁ
గాంతిశతపూరితాశు ది♦క్కాంత పూలె. 3౫౭

తరువోజ. తనచిహ్నమును జెవిఁ ♦ దన యస్త్రిరాజి
దంతోష్ఠదృగ్ఘోష♦దమున స్వాంగంబు
తనుమధ్యమునఁ దన♦ధనువుఁ గన్బొమలఁ
దనమౌర్వి నీలకుం♦తలములయందుఁ
దనమంత్రి వనమాలఁ ♦ దనమిత్త్రి నాస్య
తటిని వాక్కునఁ దేజిఁ ♦ దగ సమర్పించి
తనతండ్రిగాత్రంబుఁ ♦ దాఁ జేసి యతని
తనయుఁడై జన్మించెఁ ♦ దా స్మరుఁ డసఁగ. 3౫౮

తే. గీ. విమలతారుణ్యలావణ్య♦వీర్యధైర్య
విపులకారుణ్యముఖ్యభద్ర♦విణగణాఢ్యుఁ

డాకుమారుఁడు ప్రద్యుమ్నుఁ డనఁగ నెగడ
జగతిఁ బ్రద్యుమ్నముఖ్యాంశజాతుఁ డగుచు. ౩౬౦

(గ్రంథసమాప్తిమంగళము.)

మ. చిర ముక్తీపతిమౌళిరత్నఘటితశ్రీపాదపీఠుం డిటుల్
స్థిరుఁ డబ్జాసనముఖ్యఫాలలసితశ్రీపాదరేణుం డటుల్
వరనిశ్శ్రేయసపాంథసజ్జనమనఃపాథేయగేయోదయుం
డిర నాథుండుగఁ బొల్చుద్వారవతి మాకిష్టప్రదం బయ్యెడున్.

తే. గీ. ఒనర మణిమంజుమాళివిద్యోతితాశుఁ
డార్యుఁ డల పురుషోత్తముం డార్యనృతుఁడు
తతసముద్రమధ్యంబున ద్వారవతిని
వెలయు రుక్మిణీసహితుఁడై వేడ్క నెపుడు. ౩౬౧

తే. గీ. సకలకుశలైకగమ్య ప్రశస్తకీర్తి
సహిత భజకజనపుమర్థచయకరి పురి
యల కుశస్థలీనామిక ద్వారక యది
నాదుమది నెప్డుఁ జేయుత నర్తనంబు. ౩౬౩

మ. స్వకరాంభోజసదాతపత్త్రమును సచ్ఛాసస్త్రాఖ్యరాజ్యాప్తిఁ జి
త్సుకరాందోళిక దాస్యమాల గళమందున్ హస్తయుగ్మంబునం
దిఁక స్వాంఘ్రిర్పనకంకణంబుఁ బ్రభుఁ డబ్జేశుండు తచ్చింతనా
ధిక హేమంబు సుయుక్తిరత్నములఁ బొందించున్ ధరిత్రిన్ ననున్.

మ. అరయన్ హంసమనోహరంబు కవిభృంగాసేవ్యమున్ భాషితో
త్కరముక్తాళి నవప్రబంధజలజాతం బీశునంఘ్రిన్ రమా
వరపాణిన్ దివిజాంతరంగముల నర్పం బయ్యెడున్ శారదా
పరితోషంబు స్వహృల్లసద్గుణము తా వాయుప్రసిద్ధం బగున్.

శా. శ్రీమాంమంగళదేవి తత్పతి కథా♦శ్రీనాయికానాయకుల్
గా మాన్యం బగురంగవిఠ్ఠలకృపా♦కంధ్యంతరాప్తోక్తిర
త్నామోదప్రద రుక్మిణీపరిణయా♦ఖ్యైతత్కృతిం దీమణుల్
భూమిం సన్మణిగొండవేంకటకృతం♦బుం బ్రోవఁగాఁ బ్రార్థితుల్.

( గ్రంథాంత పద్యములు. )

ఉ. తార పటీర పారద సు♦ధా హిమ చందన పుండరీక పా
కారిగ జామృతాంశు శర♦దాగమనీరద మల్లి మందరో
ద్ధారియశస్సుకాంతి కల♦ధౌతధరాధర గాంగవారి బృం
దారకధేను వాజిముఖ♦ నారద సన్నిభకీర్తిశోభితా. 328

క. కవివిద్వజ్జనపోషణ
ప్రవిమలచాతుర్యమృదుల♦భాషణ స్వజనా
వరలసమ్యక్తోషణ
నవమణిరుచిలసితభూష♦ణా సుగుణనిధీ. 329

సుగంధివృత్తము. శ్రీలసద్గృహాంగణా గ♦రిష్ఠనంద్యసద్గుణా
శీలసత్యపాలనా ప్ర♦సిద్ధకీర్తిభాజనా
ఖాళితాఘసంఘ ధీవి♦శాలమాళి రాజగో
పాలకృష్ణయాచభూమి♦పాల సచ్ఛుభోదయా. 330

గద్య. ఇది శ్రీప్రసన్న పాండురంగవిఠ్ఠలారాధక
మణిగొండ వేంకటరమణకవి విరచితం
బగు రుక్మిణీపరిణయ కావ్యంబునందు
సర్వంబు నేకాశ్వాసము.

రుక్మిణీపరిణయకావ్యము
సమాప్తము.